మనం చూస్తున్నాం అటువంటప్పుడు మంత్రిగారు అసలు విషయాన్ని మరుగు పరుస్తూ, ప్రభుత్వ పార్టీకిచెందిన కాంగ్రెసు సభ్యులు కరువు పరిస్థితులు తీవ్రంగా ఏర్పడ్డాయిని చెబుతుంటే దాన్ని కాదని, ఏదో కొద్దిగా తక్కువనో, నార్మల్ గా పంటలు పండుతాయనో, డిఫిసిట్ ఉండదనో, లేక ఉన్నప్పటికీ తట్టుకోగలమనో చెప్పడం సబబుకాదు వెంటనే ఆ పరిస్థితులన్ని పరిశీలించి తగు చర్య తీసుకో వాలని కోరుతున్నాను అయితే ఈ 10, 15రోజుల్లో కొంతవరకు వర్షాలు పడ్డాయని అసలు పోకుండా నాలుగణాలు వంతో, రెండణాల వంతో, ఆరు అణాలు వంతో పంటపండుతుందని ఈ రెండు మూడు రోజులుగా వార్తలు వస్తున్నాయి ఏమయినప్పటికీ పంటలు మాత్రం పూర్తిగా దెబ్బతిన్నాయి

అయితే ఈ మధ్యకాలంలో కొద్దివర్షం పడినా మొత్తంమీద పంటలు దెబ్బతిన్నవి దీనినిగురించి వెంటనే ప్రభుత్వం చర్యలు తీసుకొనకపోతే ధరలు అదుపులో పెట్టలేము 1953 లో ధరలు, 1957 ధరలు పోల్చిచూస్తే, 1953 లో రైతులు పండించేదానికున్న ధరలు ఆనాడు రైతులు కొనుక్కొనే వ్యవసాయ పనిముట్లు, జీవితావసర వస్తువుల ధరలు comparative గా చూస్తే ఈనాడు రైతులు కొనుక్కొనవలసిన వస్తువుల ధరలు విపరీతంగా పెరుగు తున్నాయి. రైతుకు కావలసిన ఇనుపసామగ్రి, సెలగపారలు, కర్రులు మొదలైన వ్యవసాయపనిముట్లు, సరసమైన ధరలకు ఈనాడు రైతుకు అందించవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది రైతుకు కావలసిన వ్యవసాయ పనిముట్లధరలు, యితరవస్తువుల ధరలు విపరీతంగా పెంచి పెట్టుబడిదారులు విపరీతంగా లాభాలు తీస్తూంటే ప్రభుత్వం అదుపులో పెట్టకుండా, ఆ ధరలు పెరిగిపోయినవని, రైతుకు గిట్టుబాటు కావటంలేదని, అందువలన రైతుల పంటలకుకూడ యిష్టమువచ్చినట్లు ధరలు పెరగనివ్వాలని చెప్పటం సరైనది కాదు పేదప్రజలు, సామాన్య మధ్యతరగతి ప్రజలు తిండికి కొనుక్కొనటం కష్టమవుతున్నది. తొలికారు వరిపంట రాకముందు ధాన్యంధర బస్తా రు 22, 25 వరకు ఉంటుంది పంటరాగానే రైతులు, పన్నులు, యితర ఋణాలు తీర్చుటకు త్వరపడి అమ్ముకోవలసివస్తే చాలా తక్కువధర వస్తున్నది. చిన్నరైతులకు శిస్తులు, పన్నులు, అనేకరకాల ఋణాలు చెల్లించవలసి యుంటున్నది. ఈ పన్నులు నిరుడు గ్రామోద్యోగులు సమ్మె చేయుటవలన వసూలు చేయలేదు ఇప్పుడు ఒక్కసారిగా ఈ పన్నులు, ఎరువు అప్పులు, తక్కావీఋణాలు వసూలు చేయబోయేటప్పటికి, రైతులు తమధాన్యం చాలా తక్కువధరలకు అమ్ముకోవలసి వస్తోంది పెద్దపెద్ద భూస్వాములుగాని, నిల్వ వ్యాపారస్థులు గాని ధాన్యాన్ని నిలవచేసి విపరీతలాభాలు సంపాయించుటకు గాను, బస్తా రు. 15, 16, 17 కంటె ఎక్కువపెట్టి కొనుటలేదు. ఇంత

తక్కువధరకు కొని గోడౌన్సులో నిలవపోసి తరువాత నెమ్మదిగా విపరీతమైన లాభాలకు, బస్తా రు 22, 25 వరకు అమ్ముతున్నారనేది మనం స్పష్టంగా చూస్తున్నాము రైతులనుంచి కొనుగోలు చేయుటకు ప్రభుత్వమే ముందుకు రావాలి బ్యాంకులలో అప్పులు పెద్దపెద్ద నిలవ వ్యాపారస్థులకు యివ్వకుండా, ఆ డబ్బుతో ప్రభుత్వమే కొనుగోలుచేసి మినిమమ్ రేటు, మాక్సిమమ్ రేటు ఫిక్స్‌చేసి, మినిమమ్ రేటు రైతులకు గిట్టుబాటు అయ్యేటట్లు చూడాలి ప్రభుత్వం ఈ రకంగా సేకరించిన స్టాకు రిలీజ్ చేయుటద్వారా, ధరలను అదుపులో పెట్టాలి

నాగార్జునసాగర్ ప్రాజెక్టులో పనిచేస్తున్న కార్మికులున్నారు ధరలు విపరీతంగా ఉన్నాయి కార్మికులకు కంట్రాక్టరు డబ్బు యివ్వడు డబ్బు యివ్వకుండా రైస్‌మిల్లువద్దకు పోయి బియ్యం తెచ్చుకోమని చీటీయిస్తాడు ఆ విధంగా అక్కడ రైస్‌లో లాభం, ఇక్కడ కంట్రాక్టుపనిలో లాభం అక్కడ వారు కార్మికులకు ఇసుక, మట్టిబెడ్డలు కలసిన రైస్ సప్లైచేస్తున్నారు ప్రభుత్వ ఆధ్వర్యంక్రింద యింతపెద్ద 122 కోట్ల ప్రాజెక్టుపని నిర్వహిస్తున్నప్పుడు, పదిలక్షలో, 20 లక్షలో, తీసి ధాన్యం మార్కెటులోకి రాగానే అక్కడ పనిచేయువారికొరకు గవర్నమెంటు కొంటే ఎంతో బాగుంటుంది అటువంటి పద్ధతి లేకపోవుట మూలంగా, ఈ రోజున ధరలు పెరిగి, కార్మికులు, చిన్న ఉద్యోగస్థులు తమజీతాలు నూటికి 25 వంతులు పెంచాలని, జీవనప్రమాణం, **Cost of living** పెరిగిందని ఆందోళన చేస్తూఉంటే అందులో అతిశయోక్తి ఏమీ లేదనేవిషయం స్పష్టంగా కనపడుతున్నది

కరువు ప్రాంతాలలో పరిస్థితులు పరిశీలించి వెంటనే చర్యలు తీసుకొనవలసిన అవసరం ఉన్నది రాయలసీమలో హైలెవెల్ ఛానెల్ పనులు ప్రారంభించుటద్వారా అక్కడ ప్రజలకు పనులు కల్పించవలసిన అవసరం ఉన్నది ఈ కరువు పరిస్థితులు అదనుగా తీసుకొని రైతులకు ప్రైవేటుషావుకార్లు యిచ్చిన అప్పులు వసూలు యివ్వలేకపోతే ఆ బీదరైతులకు ఉన్న కుంటో, సెంటో కట్టుకుపోవాలని, వాళ్లు చూస్తున్నారు ఈ పరిస్థితులలో మారుటోరియం ప్రకటించి అప్పులు వాయిదా వేయాలని మంత్రిగారిదృష్టికి తీసుకువస్తున్నాను

ఇప్పుడు ఉన్న inflation ద్రవ్యోల్బణం ఉగ్రస్థద్రవ్య విధానంద్వారా, బ్యాంకుల నుంచి విరివిగా అప్పులు ఇవ్వటంద్వారా, నిల్వ వ్యాపారస్థులను ప్రోత్సహించకుండా, ప్రభుత్వమే రైతులనుంచి తరుణంలో ధాన్యంకొని, తరువాత ధరలు పెరగకుండా చర్యలు తీసుకోవాలి. లేనిచో పెద్ద పెద్ద భూస్వాములు, నిల్వ

వ్యాపారస్థులు, పంటలు రాగానే రైతులనుంచి తక్కువ ధరకు కొని, పంటల సైజము అయిపోయిన మూడు నాలుగు నెలలకు విపరీతంగా ధరలు పెంచి అమ్ముతున్నారు దానిని అరికట్టుటకు ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవాలి మనది సర్‌ప్లస్ స్టేటు, ఫర్వాలేదు అని సంతృప్తిపడినంత మాత్రాన లాభం లేదు పంటల విషయంలో ప్రభుత్వం ఎక్కువ అంచనా వేస్తున్నది ఈనాడు పంటలు పోయాయనేది స్పష్టంగా కనబడుతున్నది ప్రభుత్వం యిప్పటినుంచి జాగ్రత్తపడి, మార్కెటులోకి ధాన్యంరాగానే కొనుగోలు చేయకపోతే ఆహార ధాన్యాల విషయంలో విపరీతమైన క్లిష్టపరిస్థితులు ఏర్పడతాయి ఆహార పరిస్థితిపై ఆంధ్రదేశం మొత్తంగా కొన్ని లక్షల సంతకాలతో ప్రభుత్వాన్ని కోరారు— కరువు డిపోలు, చౌక డిపోలు పట్టణ ప్రాంతాలలో, కార్మిక కేంద్రాలలో, 500 జనాభాకు మించిన అన్ని ప్రాంతాలలో పెట్టి ధాన్యం చౌకగా సప్లయి చేయాలని ప్రభుత్వ దృష్టికి తెచ్చారు వెంటనే అలాంటి చర్యలు తీసుకోవాలి లేకపోతే ఆహారపరిస్థితులు కంట్రోలు చేయలేము ప్రజలలో అసంతృప్తి పెరిగిపోతుందని ప్రభుత్వదృష్టికి తెస్తూ యింతటితో ముగిస్తున్నాను.

శ్రీ జి సూర్యనారాయణ (గజపతినగరం - రిజర్వుడు) అధ్యక్షా, ఈనాడు రోజు రోజుకూ ధరలు పెరిగిపోతున్నాయి ధరలు పెరిగినందువల్ల వ్యవసాయ కూలీలు, మిల్లు కార్మికులు, చిన్న రైతులు, ఆహార ధాన్యాలను కొనుక్కో లేని పరిస్థితిలో ఉన్నారు ఈ పరిస్థితులిటులుండగా, వర్షములు ఈ సంవత్సరం తక్కువ అయినందున ప్రతిజిల్లాలో పంటలుపండే అవకాశంలేక రైతులకు పూర్తిగా నష్టము కలిగినదని నేను అనుకుంటున్నాను విశాఖపట్టణం జిల్లాలో పరిస్థితి సంతుష్టిగా ఉన్నదని మంత్రిగారు ప్రకటించినందుకు నేను చాలా విచారిస్తున్నాను విశాఖపట్టణంజిల్లాలో మెట్ట ప్రాంతంలో కాక, మాగాణి భూములు కూడ జలాధారం సరిగాలేక చాలవరకు పంటలు నష్టమైనవి అక్కడ పరిస్థితి బాగున్నదని జిల్లా అధికారులు స్టేటుమెంట్సు యిచ్చారేమోగాని, నేను చూచినంతవరకు పంటలు చాలా దెబ్బతిన్నాయి ఈ పంటలనష్టమే కాకుండా ప్రతి సంవత్సరం ధరలు పెరుగుతూనే వస్తున్నాయి వీటిని ప్రభుత్వం అరికట్టలేక పోయినందుకు విచారిస్తున్నాను

అధికధరలవల్ల పేదప్రజలు ధాన్యం కొనుక్కొలేని పరిస్థితిలో ఉన్నారు. కార్మికులకు శ్రమకుతగిన ఫలితంలేదు వ్యవసాయకూలీలకు సంవత్సరంలో మూడు మాసాలు మాత్రమే పనులు వుంటున్నవి మిగతాకాలంలో వారు చేసేందుకు పనులులేవు ఆ పరిస్థితుల్లో వారు అధికధరలుపెట్టి ఏవిధంగా ధాన్యం కొనుక్కోగలరని అడుగుతున్నాను. వ్యవసాయ కూలీలకు, కూలీదొరకక అనేక కష్టాలపాలు అవుతున్నారు. ప్రతిసంవత్సరం విపరీతంగా ధరలుపెరగటం

సమంజసంకాదని మనవిచేస్తున్నాను గవర్నమెంటు 6 పైసలు టాక్సువేస్తే, వర్తకులు మార్కెటులో 10, 15 పైసలవరకు పెంచుతున్నారు ఈ విషయంలో ప్రభుత్వం సరైన చర్యలు తీసుకొని, ఒకనిర్ణయమైన ధరను ఏర్పాటుచేసి, బీద ప్రజలకు ఆహార ధాన్యాలు అందుబాటులో ఉండేటట్లు చేయాలి ఈ సమస్యగురించి ఎన్నోసార్లు అసెంబ్లీలో చెబుతున్నప్పటికీ, మంత్రి గారు దృష్టిలో పెట్టుకోకపోవటం మంచిదికాదు ధరల పెరుగుదలగురించి దేశంలో ఉన్నటువంటి పేద ప్రజలు ఆందోళన పడుతున్నారు పరిస్థితులు విషమిస్తున్నవి నదులలో నీరు వృథాగా పారుతున్నది నదులకు చిన్నచిన్న డామ్సుకట్టి, ఆ డామ్సుక్రింద ఆహార ధాన్యాలను ఎందుకు పండించకూడదని అడుగుతున్నాను ఆ నదులలో నీటిని వృధాగా పోనివ్వవద్దని కోరుతున్నాను విశాఖపట్నం జిల్లాలోగల మైనర్ ఇర్రిగేషన్ స్కీములను గురించి నేను చెబుతాను దురదృష్టవశాత్తు, మా విశాఖపట్నం జిల్లాలో ప్రభుత్వం ఒకనదికైనా డామ్కట్టి, అక్కడిరైతులకు నీరు సరఫరాచేయలేక పోయినందుకు నేను ఎంతో విచారిస్తున్నాను అక్కడి మైనర్ ఇరిగేషన్ స్కీమ్సు గురించి ఒక ప్రశ్నఅడిగితే "వాటికి కొంతడబ్బు కేటాయించాము అందులో కొంత ఖర్చుచేశాము మిగతా డబ్బుకూడ త్వరలోనే ఖర్చుచేస్తాం" అని చెప్పారు విశాఖపట్నం జిల్లా మొదటి నుంచీ వెనుకబడిన ప్రాంతం అది జమీందారీ ప్రాంతం 1931 వ సంవత్సరం నుంచి అక్కడి చెరువులు, నీటి వనరులు అన్నీ పాడైపోయాయి వాటినన్నింటిని బాగుచేయించాలంటే ఎక్కువ డబ్బు కేటాయించాలి అక్కడ పాడై ఉన్నటువంటి చెరువులను, ఏటికాలువలను బాగుచేయిస్తే ఆహార ధాన్యాల కొరత కొంతవరకు తీరుతుందని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను మైనర్ ఇరిగేషన్ వర్క్సును బాగుచేస్తే, దేశంలో ఉన్నటువంటి ఆహారకొరత తీరుతుందని చెబుతున్నాను కాని మైనర్ ఇరిగేషన్ వర్క్సును బాగుచేయించటం గురించి ప్రభుత్వం ఇంతవరకు ఒక కార్యక్రమం తలపెట్టకపోవటం విచారకరం ఆహార ధాన్యాలకొరత దేశంలో చాలా ఉన్నది ఈనాడు వర్షంమీద ఆధారపడి పంటలుపండే పరిస్థితి ఉన్నది ప్రభుత్వం రైతులకు నీరు సరఫరాచేసి, ఆహార ధాన్యాలు ఎక్కువ పండించేందుకు ప్రయత్నించటంలేదు కాబట్టి ప్రభుత్వం వెంటనే మైనర్ ఇర్రిగేషన్ వర్క్సును బాగుచేయించి, రైతులకు నీరు సరఫరాచేసి, దేశంలో ప్రస్తుతం గడ్డుసమస్యగా ఉన్న ఆహారకొరతను పరిష్కరించవలసినదిగా కోరుతున్నాను. ప్రభుత్వం అతిత్వరలో మైనర్ ఇర్రిగేషన్ స్కీములను అమలుచేసి, ఆహారధాన్యాలను సంపూర్ణంగా పండించే అవకాశాలు కలిగిస్తారని ఆశిస్తున్నాను. ఈరోజు, నీటిసరఫరా లేక అనేక పంటలు పాడైపోయాయి. ఆవిధంగా నష్టపడిన రైతులకు ప్రభుత్వం కొంతసహాయం చేయాలి. రాబోయే సంవత్సరానికైనా, యీ మైనర్ ఇర్రిగేషన్ స్కీములను అమలు పరచి, నీటి

సరఫరా చేసి, ప్రభుత్వం ఆహార కొరతను తీర్చవలసిందిగా, మనవిచేస్తూ సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ సి పి తిమ్మారెడ్డి (సిరివేలు) అధ్యక్షా, ఈరోజున మానవునకు ముఖ్యమైనది అన్నము, గుడ్డ ఈ రెంటిని దృష్టిలో పెట్టుకొని మానవుడు ప్రపంచంలో పర్యటనచేయాలి ఈ రెండింటికీ లోటు ఎప్పుడూ ఉండకూడదు ఆ రెండింటికీ లోటు ఉన్నట్లయితే మానవునికి మిగతా విషయాలు ఆలోచించ టానికి అవకాశం లేకుండా పోతుంది కాబట్టి అన్నం, గుడ్డ విషయంలో ప్రభుత్వం శ్రద్ధవహించాలి ఈరోజున కొందరు పెద్దలు ప్రభుత్వంలో ఉండి ప్రజలమీద పెత్తనం వహిస్తున్నారు ప్రజలయొక్క నిత్యజీవితంలో వారు జోక్యం కలిగించుకొంటున్నారు కాబట్టి ప్రజాసంస్థల్లో ఉన్నటువంటి పెద్దలు చేసిన గొప్పపని ఏమిటంటే,—మానవునకు, మానవునకుమధ్య ఉన్న సంబం ధాన్ని విచ్ఛిన్నం చేశారు ప్రజలు తమ నిత్యజీవితాన్ని ఎట్లా గడుపుకోవాలో తెలియని పరిస్థితి కల్పించారు "అన్ని విషయాలు మేమే చూస్తాం" అన్నారు. "అందరికి సౌకర్యాలు కలుగచేస్తామం" అన్నారు ప్రజలకు తల్లి, తండ్రి, సర్వము ప్రభుత్వం అయినది ఇదివరకు కష్టాలు వచ్చినపుడు మానవులలో ఒకరినొకరు ఆదుకొంటూ ఉండేవారు అనగా ఒకరికి, ఒకరికిమధ్య ప్రేమ సంబంధం ఉండేది ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని దయార్ద్ర హృదయంతో కష్ట సమయంలో ఆదరించటం మన హిందూదేశంలో పరిపాటి అటువంటి సంబంధం యీనాడు విచ్ఛిన్నమైపోయింది అటువంటి పరిస్థితులు ఈనాడు మానవునిలో లేకుండా పోయాయి మానవునిలో నైతికపతనం కలిగింది వ్యక్తికి వ్యక్తికి సంబంధంలేని యీ రోజులలో ఉన్నటువంటి పరిస్థితి ఏమిటి? ఈనాడు ఆహార సమస్య ఉన్నది. ఈ పరిస్థితుల్లో మనం ఎక్కడకు దిగజారిపోతామో నాకు అర్థంకావటంలేదు. బీదలు, రైతు, రైతు కూలీలు ప్రపంచంలో ఏ విధంగా ప్రవర్తించాలో అర్థంకాని పరిస్థితి ఏర్పడుతోంది ఏ విధంగా ప్రవర్తిస్తే తాను సునాయాసంగా జీవించకలుగుతాడో మానవుడు అర్థంచేసుకోలేని పరిస్థితిలో ఉన్నాడు ప్రపంచం అగమ్యంగా ఉంది. అర్థంకాని ప్రపంచంగా మారిపో తోంది అర్థంకాకుండా ఉన్నటువంటి పరిస్థితి ఏర్పడుతోంది. రైతుకు కూలీకి మధ్యఉన్న సంబంధం చెబుతాను మా ప్రాంతంలో ఉన్న పెద్ద పెద్ద రైతులు ధాన్యం సేకరించి అట్టె పెడుతూ వచ్చారు. మా ప్రాంతం కరువు కాటకాలకు అలవాటుపడింది కాబట్టి. అక్కడ ఎప్పుడైనా కరువు వస్తుందనే ఉద్దేశంతో, బస్తాలకొద్దీ ధాన్యం సేకరించి ఉంచేవారు. ఎప్పుడైనా కరువు వచ్చినపుడు అక్కడఉన్న పెద్దలంతా కలిసి అరువుక్రిందనో, ఉచితార్థంగానో, గంజి కేంద్రాల ద్వారానో ప్రజలకు సహాయం చేస్తూ ఉండేవారు. కాని ఇప్పుడు వారిదగ్గర

కూడా ధాన్యంలేని పరిస్థితి ఏర్పడింది ఎందుకంటే, వారికికూడా బాధ్యత లేదు వారికి వారికి మధ్యఉన్న సంబంధం విచ్ఛిన్నం చేశారు ఒకరివద్ద నిలవలు ఎక్కువ ఎందుకు ఉండాలని, ప్రభుత్వం వారిదగ్గరనుంచి ధాన్యం సేకరిస్తూ వచ్చింది ఆ విధంగా నిలవ చేసినవారిని, పనికిమాలిన వారిక్రింద జమకట్టారు వారిని కె డి ల క్రింద చూశారు ఆ విధంగా వారు నిలవచేసిన ధనం ఉప యోగపడకుండా పోయింది పరిస్థితి అగమ్యగోచరంగా ఉన్నది ఇప్పుడు కరువు రావటానికి ఎన్నో కారణాలు ఏర్పడుతున్నాయి కరువు రావటానికి కారణం, అనావృష్టియే కాదు అతివృష్టివల్లకూడా కరువు ఏర్పడింది మా ప్రాంతం వర్షంమీద ఆధారపడే ప్రాంతం మా రాయలసీమ ప్రాంతం (కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాల ప్రాంతం) కేవలం వర్షంమీద ఆధారపడిన ప్రాంతం వర్షాలుపడితే పంటలు పండటం వర్షాలు పడకపోతే పంటలు పండక పోవటం జరుగుతున్నది 2, 3 సంవత్సరాలక్రితం కర్నూలుజిల్లాలో అతివృష్టి వల్ల పంటలు పోయాయి బావులు నిండి, నీరు పొంగి, బయట ప్రవహించి పంటలు నష్టము అయ్యాయి. ఆ విధంగా ఆనాడు పంటలు పండనటువంటి పరిస్థితి వచ్చింది ఈ సంవత్సరం అనావృష్టి బయలుదేరింది అతివృష్టి వచ్చి నపుడు పంటలు చెడిపోవటంవల్ల, ఈ సంవత్సరంకూడ వర్షాలు కురుస్తాయనే భావంతో, వర్షాలు ఎక్కువపడితే ఏమిపంటలు పండుతాయో, ఆ పంటలు వేశారు ఇప్పుడు అనావృష్టివల్ల ఆ పంటలన్నీ దెబ్బతినిపోయాయి వేరుసెనగ పంట దెబ్బతిన్నది కమర్షియల్ క్రాప్స్ దెబ్బతిన్నవి జొన్నపంట ఎండిపో తున్నది గవర్నమెంటుతో చెబితే "ఎంతో సానుభూతి ఉన్నట్లు" వారు మాట్లాడుతారు. ప్రజలదగ్గరకు పోతే వాళ్లకష్టాలు వాళ్ళుచెబుతారు

కాని యిదంతా సామాన్యంగా మాట్లాడడమే తప్ప క్రియలో ఏమి కనిపించడంలేదు. ఈ లోటు ఎక్కడఉన్నదో తెలియదు పరిస్థితులలో ఉన్నదా ప్రతినిధులలో ఉన్నదా లేకపోతే ప్రభుత్వములో ఉన్నదా లేకపోతే పరమా త్ముని యొక్క నిర్లక్ష్యములో వున్నదేమో యిది ఏమీ అర్థంకావటంలేదు. ఆయనయొక్క నిర్ధారణ ఏమిటో తెలియుటలేదు అందులో ఉన్నటువంటి వారియొక్క పరిస్థితి చూస్తే, వారు మనలను గురించి ఏమి చెప్పడంలేదే, మనలనుగురించి ఏమీ మాట్లాడడములేదే అని వారు అనుకుంటారు. అంతా తెలుసును అని ప్రభుత్వంవారు అంటారు కాని యీ connecting link ఎక్కడ fail అయిపోతుందో ఏమీ అర్థముకాలేదు కాని అందరుకూడ నిజంగా సాను భూతి తెలిపేపక్షంలో, నిజంగా అది అవసరమైన పక్షములో మీరు దానిని మాత్రము సక్రమంగా నడిపేపక్షములో, మనకు యీ బాధలేదు. పైగా వచ్చినటువంటి యీ సభ్యత్వం మాత్రము అన్నింటికంటె చాలా అనర్థ దాయకముగా కన్పిస్తుంది. లేదా, పనికిమాలినదిగా కూడ చెప్పవలసి

వస్తుందేమో ఎందుకంటే మధ్యవర్తిగా అయి ప్రజలతరపున ఇటు ప్రభుత్వము తరపున సమన్వయము చేసినటువంటి విధానము ఇది. ఈ మధ్యవర్తిత్వము ఎంతో జాగ్రతగా చేస్తేతప్ప ఇది సాధ్యముకానటువంటి వ్యవహారము కాని అక్కడ వారికష్టములు ఇక్కడ ప్రభుత్వమువారు అయినా గుర్తించాలి. లేకపోతే ఇక్కడ ప్రభుత్వానికి ఉన్న పరిస్థితి అక్కడ వారుఅయినా గుర్తించాలి అక్కడ వారు గుర్తించడములేదు ఇక్కడ వీరు గుర్తించడములేదు ఈమధ్యన అవస్థలుపడుతూ అల్లాడిపోతున్నారు కాబట్టి యీ పరిస్థికులు మాత్రము దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వము ఏ ఏ ప్రాంతాలలో, ఏఏ ప్రదేశాలలో ప్రజల కేవేవిఅవసరమో చూడాలి నిజానికిచూస్తే మేము చూచాము అని చెబుతారు లేకపోతే వస్తాయిలే, పండుతాయిలే అని ప్రభుత్వమువారు అంటారు అక్కడికి పోతే వారు మాకు ధాన్యములేదంటారు చౌకడిపోలు పెట్టమని ప్రభుత్వాన్ని అడిగితే ఏవోకొన్ని కారణములు చెబుతారు లేకపోతే ఇది Central Government question అని అంటారు లేకపోతే, పైనుంచి మనకు వచ్చేదానికి మాత్రము యీ ప్రొద్దునవేసే ఆశ్చర్యమేమిటి అంటే, ఇది ఆర్థిక అభావమని అంటారు ఇన్ని సం॥లు గా ప్రభుత్వం నిజముగ ఉన్నదంటే, ప్రభుత్వము మాత్రము చిన్నదా? ఒక యింటిపెత్తనం వహించాలంటే ఊరకనే అవుతుందా? ఇంటిపెత్తనం వహించాలంటే సర్వబాధ్యత తీసుకోవలసిందే ఆ కష్టసుఖాలు చెప్పవలసింది మాకుకాదు మాకు కావలసినది ఏమిటంటే ప్రజలు యివి అడుగుతున్నారు గనుక, వారి అవసరాలు తీర్చడము కావాలికాని అది ఏరూపములో తీర్చుతారు అనేది మా సమస్య కాదు ఇక్కడికి వారిని తీసుకుని రండి లేదా సెంట్రల్ గవర్నమెంటునుంచి తీసుకునిరండి లేదా ప్రజలవద్దనుంచి తీసుకునిరండి ఎక్కడినుంచి అయినా తీసుకునిరండి అవసరము ఉన్నవారికి మాత్రమే అందుబాటు చేయడముమాత్రమే కావాలి. అందువల్ల యీ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వము చేసేటట్లైతే లేదా, దానికి తగినటువంటి సలహాలు వారుకూడా యిచ్చేటట్లైతే, బాగావుంటుంది ప్రజల పరిస్థితులు యిబ్బందులు యీ విధముగ ఉన్నవి అంటే, అందుకు తగినఏర్పాట్లు చేయాలి మేమేమిచేయటానికి వీలులేదుగదా. ఒక వేళ చేయవలసివస్తే చేయండి కాని ఆ రూల్సు అన్నీ మాకుచెబితే ప్రయోజనం ఏమిటి? దానిని వీలుఅయినంత వరకు సర్దుబాటుచేసి ఆయాప్రాంతాలలో ఆహారధాన్యాలు అందుబాటు చేయటానికి ప్రయత్నం చేయాలి. అంతేకాకుండా ఇప్పుడు ఉన్న పరిస్థితులలో ముఖ్యంగా ఉన్నది ఏమిటంటే పూటికిలేకుండ బాధపడుతున్న కూలివర్గానికి కూలికావాలి అంటే వాళ్లకు కూలిచేసుకోటానికి పనులు చూపించాలి. పేద వారికి కావలసినది పనులుగదా! వారికి పని చూపించాలంటే ఆయా ప్రాంతాలలో పనులు కల్పించాలి. ముందు గంజికేంద్రాలు ఏర్పాటుచేయాలి. సామాన్య

మైన రైతుకు ఏమి కావలసిఉంటుంది ? వారికి కావలసినంతమటుకు అప్పులు యివ్వాలి ఇప్పటికి రెండు, మూడు సం॥ల నుంచి వాళ్ళు యివ్వవలసిన అప్పులు బకాయిలలో ఉండిపోయినవి ఏదో సామెతచెప్పినట్లు, కొత్తమొక్కులు మొక్కబోతే, పాతఅప్పులవాడు తగులుతున్నట్లుగా ఏమి అయిపోతున్నదంటే, యిప్పుడు యీ పన్నులభారమువల్ల నైతేనేమి, లేకపోతే అప్పులు బకాయిలలో ఉండడంవల్లనైతేనేమి, లేదా గ్రామోద్యోగస్థులు చేసినటువంటి సమ్మెవల్లనైతే నేమిచివరకు ప్రజలునానాబాధలు పడుతున్నారు కాబట్టి ముఖ్యంగాప్రభుత్వం చేయవలసిన పనులు మాత్రము చెబుతున్నాను మొట్టమొదట పేదవాళ్ళకు గంజికేంద్రాలు ఏర్పాటుచేయాలి రెండవది, అంతకంటె కొంచెము పైగ్రేడు పేదవాళ్ళకు ముఖ్యంగా కావలసినది తిండి గనుక వాళ్లకు ధాన్యము అప్పుగా ఇవ్వాలి వాళ్ళకు కూలిపని ఉన్నదా లేదా అనేది సమస్యకాదు ధాన్యము అప్పుగా యిస్తే మరల ఆ అప్పు తీర్చగలవారికి కేవలము మనిషి సెక్యూరిటీమీద యివ్వాలి ఆ అప్పు వాళ్ళు ఎన్నడో ఒకరోజున నియమిత కాలములో తీర్చుకోగలుగుతారు అని నా ఉద్దేశ్యము అవసరమైన వాళ్ళకు, తీర్చగలిగినవాళ్ళకు ధాన్యము అప్పుగాయివ్వాలి ఇదిమాత్రము ముఖ్యంగా అత్యవసరముగ చేయవలసినపని. భూములు గుత్తకు చేసుకొనేవారు ఈలాంటి అప్పులు తీసుకోవచ్చు ఈ అప్పులు temporary గా మాత్రము యివ్వవచ్చు ఈప్రయత్నము మాత్రము ప్రభుత్వముముందుచేయాలి ఇక మూడవది ఇప్పుడు బకాయిలుగా ఉన్న అప్పులు ప్రస్తుతము కొంతకాలము వసూలుచేయకుండ ఆపుదల చేయాలి. ఇక నాల్గవది రైతులకు కావలసినంత మటుకు పుష్కలంగా అప్పులు యివ్వాలి ఈ రోజులలో రైతులు అప్పులుతీర్చే పరిస్థితులలో లేరు. ఎందుకంటే, ఏదో Land Reforms ప్రవేశ పెట్టబోతాము అని ప్రభుత్వమువారు చెబుతున్నారు ఈ reforms వస్తాయనే ఉద్దేశ్యమువల్లనో, లేకపోతే అప్పులుయిస్తే తిరిగివస్తాయో, రావో అనే అనుమానముచేతనో, డబ్బు అప్పుయిచ్చే సాహుకారును డబ్బు అప్పుఅడిగితే వారు కనబడకుండా పోతున్నారు కారణము ఏమిటి అని అడిగితే వారు చెప్పేది ఏమిటి అంటే, మీకు కావలసినన్ని భూములు మీకు ఉన్నప్పటికినీ, మేము మీభూములు చూచి మీకు అప్పులుయిస్తే, మీరు అప్పుతీర్చలేకపోతే, మేము ఆ భూములు తీసుకో వాలిగదా. ఆ భూములు తీసుకుని మేమేమిచేయాలి, కాబట్టి మేము మీకు అప్పులు యిచ్చేదానికి వీలుకాదు అని అంటున్నారు, ఇలాంటి పరిస్థితి ఏర్పడి పోయింది పోనీ, వీళ్లు భూములు అమ్ముకుందామంటే కొనేవాళ్ళులేకపోయె, అప్పు అడుగుదామంటే యిచ్చేవాళ్ళు లేకపోయె, పాతఅప్పులకోసం ఇదివరకు యిచ్చిన సాహుకార్లు వాళ్ళమైన ఎగబడి ఆందోళనతో అల్లరిచేస్తున్నారు. పైగా ప్రభుత్వానికి యివ్వవలసినఅప్పులు అసలే బకాయిలుగా ఉండిపోయాయి. ఈపరిస్థి

తులలో వాళ్ళు ఏమిచేయాలి ? దీనికి మించి భగవంతుడుకూడ తక్కువచూపు చూస్తే కరువుకూడ నెత్తినపడేటట్లయితే, ఇక ఆ ప్రాంతములో ఉన్న పరిస్థితి ఎంతఘోరముగా ఉంటుందో ఊహిస్తే తెలుస్తుంది ఆ పరిస్థితులలో మనమే ఉంటే దాన్ని అర్థముచేసుకోవచ్చు కాబట్టి యివి అన్నీ దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వము ఒక రకముగ శ్రద్ధతో ఆలోచించాలి ఇక్కడ ఏదో సభ్యులు చెప్పడము, అందులో ఇక్కడఉన్న పరిస్థితులనుబట్టి చూస్తే ఏమి అర్థము అవుతున్నదంటే, ఏదో సభ్యులు యిక్కడ చెబుతున్నారు, వెళ్ళుతున్నారు అని, అనుకోకూడదు అనగా సభ్యులు చెప్పేదానిలో అసత్యము ఎక్కువఉన్నది అని వాదించినవారు ఉంటే, వారు అక్కడికి వెళ్ళి చూస్తే నిజము తెలుస్తుంది అయితే సభ్యులుచెప్పినది అంతాకూడా అసత్యముగా ఉండదు గాని, ఆ అసత్యాన్ని యిక్కడమాత్రము సమర్థించాలని ప్రయత్నము చేయకుండ యీ సభావేదికపైన మాత్రము చెప్పడము సమంజసమైనదికాదు కాని అది నిజముగ ఏ ఏ ప్రాంతాలలో జరుగుతున్నదో, ఆ ఉన్న ప్రాంతాన్ని దృష్టిలో పెట్టుకుని ఆ వ్యక్తి చెప్పినదికూడ కొంచెము ఆలకించి, లేకపోతే అవసరమైతే ఆ ప్రాంతానికివెళ్ళి, దాన్ని కొంత చూచివస్తే బాగాఉంటుంది గాని, అది ఏదో సామాన్యముగా మాట్లాడడము, సామాన్యముగా వెళ్ళడము అనే ఉద్దేశ్యము కాకుండా దీన్ని మాత్రము దృష్టిలోపెట్టుకుని ఆ ప్రాంతపు ప్రజలకు ప్రయోజనము, సహాయము చేస్తారని ఆశిస్తూ, యింతటితో సెలవుతీసుకుంటున్నాను

శ్రీ బి రామారెడ్డి (మైదుకూరు) · అధ్యక్ష మహాశయా, ధాన్యపు ధరలు పెరగడము అనే నిరంతర నిర్విరామమైన యీ నినాదము కేవలము రైతు కానటువంటివారు చేస్తున్నటువంటిదే రైతు కష్టసుఖములు ఎరుగకున్నటు వంటివారందరు రైతు లోకముపై చేయు నిర్దయాత్మకమైనటువంటి యుద్ధ నినాదముగ దీన్ని నేను పరిగణిస్తున్నాను కాని యిందులో ఉన్న సంతోషకర మైన విషయము ఏమిటంటే, మన వ్యవసాయశాఖ మంత్రిగారు రైతుయొక్క కష్ట నిష్ఠూరాలను గురించి రైతు పండించే ఆహారధాన్యపు ధర ఎందువల్ల ఒక నిర్దుష్టమైన స్థితిలో ఉండాలి, అనేది వారు నిర్మాణాత్మకంగా తమ యొక్క report లో తెలపడము, అది యితర వృత్తులవారికి కొంతవరకు కోప కారణ మైన కూడ నిర్భయముగ వారు చాటినందులకు రైతులోకము తరఫున వారికి నా హృదయపూర్వకమైన ధన్యవాదములను తెలుపుతున్నాను. కాని రైతు పండించే పంట యొక్క ధర ఎక్కువ అయినదని చెప్పేవారు ఎవరైనా కూడ రైతు యీనాడు ఏపరిస్థితులలో ఉన్నాడు. తన జీవితయాత్ర సరిగా చేస్తున్నాడా లేదా సరిగా తన యొక్క కుటుంబ పోషణ చేయగలుగుతున్నాడా, లేదా అనేది ఆలోచించాలి అందును గురించి విమర్శించేవారందరు కూడ రైతు

కుటుంబము నుండి వచ్చినవారుగా ఉండి, కేవలము ఒకసారి అయినా యీ విషయము విచారించియుంటే నిజస్థితి తెలుసుకోగలరు అలాగాకుండా కేవలము కళ్లుమూసుకుని ఏదో ఒక బిల్లుకొరకు యీ విధముగ మాట్లాడుతున్నారా అనేది నాకు సందేహముగ ఉన్నది ఆ విధముగా మాట్లాడేటట్లయితే వారు ఒకసారి ఆత్మపరిశోధన చేసుకుని మాట్లాడితే బాగా ఉంటుంది అలా చేయక పోవడము చాలా విచారకరముగ ఉన్నది ఈ ధరలను కంట్రోలులో పెట్టాలి అని కోరేది కేవలము పేదప్రజలు, కొనితినేవారు వాంఛించితే వాంఛించవచ్చు. పంటలు పండించే రైతుకష్టములు, కొనితినేవారి కష్టములు యీ రెండున్నూ ధరలను control చేయమనేవారు సమన్వయదృష్టితో చూడవలెనేకాని, కేవలము దీనిని ఒక పక్షముతరపుననే view చేయడమనేది మాత్రము సబబుగాలేదు అని మనవిచేస్తున్నాను కాని ఒక్క విషయము మాత్రము చెప్పదలచాను ఉదాహరణకు ఆలోచిస్తే, చేనేత వారు యీరోజులలో చేసేవాదము ఏమిటి? వారు నేసేటువంటి బట్టలకు ఎక్కువరేటు రావాలని, rebate కావాలని, subsidy కావాలని ఎందువల్ల వాంఛించుచున్నారు? రైతు పంటను ఏవిధముగ produce చేస్తున్నాడో, అదేమాదిరి చేనేతవారు బట్టలను produce చేస్తున్నారు అయితే. చేనేతవారు తమకు గిట్టుబాటు ధర రావాలని కోరుతున్నప్పుడు అది ప్రభుత్వము ఆమోదించడమనేస్థితి వున్నప్పుడు ఆ advantage రైతుకుమాత్రము ఎందుకు ఉండకూడదు? ఇక పోతే labour ఉంటున్నది వారు ఏమి చెబుతున్నారంటే, "మేము ఎక్కువపని చేయము, ఎక్కువగంటలు చేయము దినమునకు నాలుగు గంటలో, అయిదు గంటలో, ఆరో, ఎనిమిదో పనిచేస్తాము అంతకంటె చేయము కాని మాకు యిచ్చేకూలి మాత్రము మాకుఎక్కువగా ఇవ్వండి అని కోరుతున్నారు లేబరుచేత తక్కువ కాలము పనిచేయించుకుని ఎక్కువ కూలీ యివ్వాలంటే, ఏ producer అయినా డబ్బుకొరకు బాధపడుతాడు పనిమాత్రము ఎక్కువ జరుగదు. Producer అనే రైతుకు గిట్టుబాటు ధర కావాలంటున్నది ఈ ఖర్చులు అన్ని భరించుటకేకదా? అదే దృష్టితో చేనేతవారు తాము produce చేసే బట్టకు ఎక్కువగ గిట్టుబాటుధర కావాలంటున్నారు. సరే. కాని తాము కొనుక్కొనితినే తిండిగింజల ధరలను Control చేయమని అంటున్నారు ఎందువల్ల? వారు produce చేసే బట్టకు గిట్టుబాటు ధర కావాలి, ధరను మాత్రము Control చేయకూడదంటారు. ఇక లేబరు చూద్దామా అంటే, పనితక్కువ చేయాలి డబ్బు ఎక్కువ కావాలి ఇది వారి వాదన. వీటి అన్నిటికి డబ్బు ప్రధానము. అయితే యీడబ్బు ఎట్లా వస్తుందనేదే ప్రశ్న. తిండికి అవసరమైన ధాన్యము ఎట్లా పండించగలుగుతున్నాడు, రైతు? ఎండపక, వానపక, తాను, భార్య, బిడ్డలతోసహా అందరుపోయి రాత్రింబగళ్ళు అంతయు కావలియుండి, ఆ పండిన ధాన్యమును ఎంతకష్టముతో యింటికి

తేగలుగు తున్నాడో ఒక్కసారి యీ control చేయాలి, అని వాదించేవారు ఆత్మవిచారణ చేసుకోమని కోరుతున్నాను

ఇంతకష్టపడి పండించిన రైతుకు లేబరుకు యిచ్చేకూలి, పండించటానికి ఎరువులు వగైరా ఖర్చు అన్నీ చేరి ఎకరమునకు ఎంతరాబడి ఉందో, ఆయనకు యీ వ్యవసాయఖర్చులు అన్నిపోను ఏమైనా మిగులుతున్నదా అని ధాన్యపు ధర స్థిరీకరణ చేయమని కోరేవారిలో ఒక్కమహానీయుడైనా ఆలోచించాడా? ఒక్కవిషయము మాత్రము నేను మంత్రిగారిదృష్టికి తేదలచుకున్నాను K. C. కెనాల్ ప్రాంతములో పంటలు పండిస్తున్నారు అక్కడ ఒక్కొక్క ఎకరానికి చేయవలసిన ఖర్చు సుమారు నూరు మొదలు నూటయాభై రూపాయలవరకు అవుతున్నది సాధారణముగా యకరానికి average మీద ఒక పుట్టిపంట పండేదానికి ధర రెండువందలు, రెండువందల యాభై రూపాయలు, యీమధ్య రావచ్చును ఇక ఆయనఖర్చులు ఎకరానికి 150 రూపాయిలు అయితే అతనికి ఎంత మిగులుతున్నది, మిగిలినదానిలో అతని కుటుంబము ఎట్లా పోషించు కోగలుగుతున్నాడు అనేది ఒకసారి ఆలోచిస్తే, తెలుస్తుంది. అప్పుడు యీ విమర్శించేవారు అంత నిర్దయగా విమర్శించరు అనుకొంటాను కాబట్టి రైతు విషయములో ఒకవిధమైన సానుభూతి చూపిస్తారని నా కోరిక ఎప్పుడుచూచినా ధాన్యమునకు ధర పెరిగిపోతున్నది, పెరిగిపోతున్నదని అంటారేకాని, మన గౌ॥ సభ్యులు నాగిరెడ్డిగారు కూడ అదేమాట చెప్పారు కాని ఒక్కవిషయము గుర్తించమంటున్నాను 1939 సం॥ లో రైతుకు కావలసిన నాగలికర్రు ఒక్కొక్కటి ఆరుఅణాలు, అర్ధరూపాయి ఉండేది. అంటే 50 నయాపైసలు అన్నమాట. మరి యీ రోజులలో దానిని 2 రూపాయలు, 2½ రూపాయలు పెట్టి కొనవలసివస్తున్నది అయినప్పుడు ఆనాటికీ యీనాటికి రైతు కొనవలసిన వస్తువులధరలు ఆరురెట్లు హెచ్చినప్పుడు అదేరేట్లచొప్పున రైతులు పండించే పంటధరలు పెరగాలంటే 300 రూపాయలయితేనేగాని కిట్టదనే విషయం ఆలోచిస్తే తెలుస్తుంది దీనికిమార్గం యేమిటి? రైతు కొనవలసిన సర్వేటు మున్నగు వస్తువులు చెప్పనలవికానంత హెచ్చుధరలో వుండగా, రైతులు పండించిన పంటల ధరలుమాత్రమే తగ్గించాలని అనడంమాత్రం కేవలం అన్యాయమని మనవిచేస్తున్నాను. రైతు స్థితి ఏ విధముగా వుందో ఉదాహరణ చెబుతున్నాను ఈ రోజు రైతు ప్రభుత్వం యివ్వదలచుకున్న అప్పులను తీసుకొని కూడా వాటిని తీర్చలేక తమ ఎద్దులను, మిగతా ఆస్తిని పోగొట్టుకుంటున్నా డంటే అది తమాషాకొరకు కాదు. రైతు అటువంటి అధ్వాన్నపరిస్థితిలో వున్నాడు. అట్టి పరిస్థితిని తొలగించడానికి ప్రభుత్వం సహాయంచేసి ఋణబాధను తీర్చి ఆహారధాన్యాలను పండించాలనే ఉత్సుకతను రైతులలో జనింపచేస్తే.

ధరలు వచ్చేపంటలను పండించుటకు పూనుకోకుండా వ్యవసాయమునకు సంబంధించిన ఆహారధాన్యాలను రైతు పండించగలడు, అప్పుడు ఎక్కువధాన్యం నిలువలుంటాయి, ఒకవిధమైన సుభిక్షవాతావరణం ఏర్పడుతుంది అటువంటి వాతావరణం ఏర్పడడానికి రైతును ఋణవిముక్తుని చేసేవ్యవహారం చేసినట్లయితే దేశం బాగుపడుతుంది రాజ్యానికి రైతులు పునాది అంటారు పునాదిగావున్న రైతును సర్వనాశనం చేయడం భావ్యంకాదు సహకార సంఘాలద్వారా రైతుకుగల ఋణాన్నంతా ప్రభుత్వమే తీర్చివేసి, వారు పండించిన ధాన్యాన్ని సహకారసంఘాలద్వారా వారికి తగిన market చూపించి వారు తీర్చవలసిన ఋణం వాయిదాల మొత్తంపోను మిగతాది యిచ్చి ప్రభుత్వం ఋణం తీరేటంతవరకయినా ఆ విధంగా చేసినట్లయితే రైతు ఋణబాధనుంచి విముక్తిపొంది, తాను పండించిన పంటకు యింతధర కావాలనే పట్టుదల లేకుండా వ్యవసాయమునకు సంబంధించిన ఆహారపదార్థాలను పండించే స్థితిలో వుంటాడు ముఖ్యంగా ప్రభుత్వధర్మం యేమిటంటే రైతు ఋణభారాన్ని తీర్చి అటు రైతుకు ఇటు నౌనితినే బీదప్రజానీకానికి సహాయం చేస్తారనీ, అటువంటి ప్రయత్నం చేయడానికి సభ్యులందరూ సాదరపూర్వకంగా అనునయమైన దృష్టితోచూచి రైతు ఋణభారాన్ని తీర్చడానికేదైనా ఉపాయం చెప్పి దానిని ప్రభుత్వం ఆచరణలో పెట్టేటట్లు చేయగలిగితే ఆనాడే రైతు సుభిక్షంగా వుంటాడు రైతు సుభిక్షంగావుంటే రాజ్యము సుభిక్షంగా వుంటుంది ఆనాడు "సర్వేజనా స్సుఖినోభవంతు" అనే పద్ధతిలో వుంటారని మనవిచేస్తూ సభ్యులందరూ రైతులోకానికి ఋణభారం పోయేపద్ధతి ఆలోచించినచో ఆనాడు ఆహారపరిస్థితి కూడా బాగుపడుతుందని మనవిచేస్తూ విరమిస్తున్నాను

శ్రీ రంగారెడ్డి (బాల్కొండ) అధ్యక్షా, సామాన్యంగా ఏ వృత్తిలోని వారైనా పెట్టుబడికి తగిన ఆదాయం వుంటుందా లేదా, వారికి గిట్టుబాటుగా వుందా లేదా అని ఆలోచించి వారికివచ్చే ఆదాయమును control చేసుకునే స్థితిలో వున్నారు కాని వ్యవసాయదారుని స్థితివేరు. భూమివుండి, దానికి మూలధనం అవసరం వుంటుంది, దానివిలువ కట్టవలసి వుంటుంది జంతువుల ధర కట్టవలసిన అవసరం వుంటుంది అదేవిధంగా ఆ సంవత్సరానికి తగిన ఖర్చు లన్నీ విలువకట్టవలసివుంటుంది ఇవికాక వ్యవసాయపరికరాలు, తదితరవస్తువులను కొనినదానికి డబ్బు మొత్తం కట్టవలసిన అవసరం వుంది ఇతర పరిశ్రమలలో తరుగు (depreciation) కీ, ఆప త్కాలానికి అవసరమైనడబ్బు అనీ వేరు వేరుగా కేటాయించబడుతుంది. కాని వ్యవసాయంలో మాత్రం క్షామపరిస్థితులు ఏర్పడి 10 సంవత్సరాలలో కనీసం 4 సంవత్సరాలైనా దుర్భర పరిస్థితులు

వస్తాయి అప్పుడు రైతుతట్టుకోలేడని మనమందరము ఎరుగుదుము అట్టి ఆపత్తులకొరకు reserve fund వుంచే విషయం వ్యవసాయదారుడు గాని, మనము గాని ఆలోచించలేదు ఈ విధంగా వారికి ఒక ఎకరం వుందంటే, దానికి మార్కెట్టులో 10 వేల రూపాయల విలువవుంది చక్కెర పరిశ్రమలో వంద రూపాయలు పెట్టుబడి పెడితే 50 నుండి 70 రూపాయలవరకు నికరాదాయము వస్తుంది దానినెవరూ ఆక్షేపించరు అదేవిధంగా వ్యవసాయవృత్తికి రైతుకు ఎంత పెట్టుబడి అవసరంవుంది ? దాని depreciation ఎంతవుతుందనే విషయంకూడా ఎవరూ ఆలోచించడంలేదు ఆలోచించినట్లయితే యదార్థంగా ప్రస్తుతం యిచ్చేధరలు రైతుకు గిట్టుబాటుగా లేవని మనం ఒప్పుకోవలసి వస్తుంది తరువాత, వ్యవసాయ కూలీలు యేమి బాధ్యత లేకుండా నాలుగు గంటలో అయిదు గంటలో ఆరుగంటలో పనిచేసి ఆ పనికి తగిన కూలి రావాలని కోరుతారు న్యాయమే. కానివ్యవసాయదారుడు తన కుటుంబములోనివా రందరితో కలిసి రాత్రింబగళ్లు రెండుమూడు shift లలో పనిచేయవలసివస్తుంది ఇంత చేసినా, కాలమాన పరిస్థితులు అనుకూలంగా లేకుంటే విపరీతమైన నష్టాలకు గురికావలసి వస్తున్న పరిస్థితులను మనము చూచాము అటువంటి పరిస్థితు లొకవైపున వుండగా, మరోవైపున ఆహారకొరత వుందని, ఆహార ధాన్యాల ధరలు విపరీతంగా పెరిగిపోయాయని పత్రికలలో చాలా ఆందోళన (agitation) జరిగింది దీనివల్ల న్యాయంగా రావలసిన ధరలు కూడా రైతుకు రాకపోవడము, రైతు కొనే వస్తువుల ధరలు విపరీతముగా పెరిగిపోయాయి వ్యవసాయ మంత్రిగారు ఆహార పరిస్థితిని గురించి యిచ్చిన statement ను చూస్తే గత అయిదారు సంవత్సరాల లోపల వ్యవసాయదారులు వాడుకునే వస్తువుల ధరలు పెరిగిపోతున్నాయనీ రైతులు పండించే పంటల ధరలు 1954వ సంవత్సరంలో వున్న ధరల కంటె పడిపోయాయనీ స్పష్టమవుతుంది దీనికి అసలు కారణం యేమిటంటే గట్టిగా అరచినవాళ్లముందు ప్రభుత్వంవారు లొంగుతారని, క్రమేణా ప్రచారంచేసి, ఆందోళనచేసేవారు ప్రభుత్వాన్ని వంచి తమ కోర్కెలను నెరవేర్చుకోవడంలో సఫలులవుతారనీ స్పష్టపడుతున్నది కాని యీ వ్యవసాయదారుడు revolutionary కాకపోవడం వల్ల revolutionary కావడానికి అవకాశాలు లేనందువల్ల బాధపడుతున్నాడు. వారికి united front లేనందువల్ల యదార్థంగా వారికి రావలసిన ధరలు కూడా మనం యివ్వడంలేదు అని స్పష్టమవుతుంది నేను కొన్ని సాదృశ్యాలు చెప్పదలచుకున్నాను

సామాన్యంగా పట్టణాలలో వున్న మధ్యతరగతివారికీ పల్లెటూర్లలోవున్న మధ్యతరగతివారికీ తేడా లున్నాయి పల్లెటూరిలో రైతు దుర్భర కష్టాలను అనుభవిస్తూంటే పట్టణాలలోనివారి జీవితం సుఖవంతంగా ముందుకు పోతున్నది.

పట్టణాలలోనివారు వారానికి రెండు మూడు సార్లు విందులు చేసుకుంటారు వారానికి రెండు మూడు సార్లు సినీమాలకు పోతారు ఆహారధాన్యాల ధరలు పెరిగిపోతే పట్టణాలలో చౌకడిపోలు పెడతారు యదార్థంగా పల్లెటూరిలో ration యివ్వబడలేదు తక్కువ ధరలకు బియ్యం సరఫరాచేయడానికి వారే అర్హులు వారి కోర్కెలు ప్రభుత్వంముందుకు రావడంలేదు వచ్చినా ఆ రైతు కూలీలకు చౌకధరలకు బియ్యం సప్లయిచేయడానికి ప్రయత్నం చేయడం లేదు ఆహార కొరతపై శాసనసభలో యీవిధంగా చర్చచేయడం వల్ల యదార్థంగా ఆహారకొరత లేకపోయినా hoarders లాభం పొందే ప్రమాదం వుంది క్లిష్ట పరిస్థితులు ఏర్పడబోతాయని పత్రికలు ప్రచారంచేస్తే, స్వార్థపరులు యీ అవకాశాన్ని వాడుకుంటారు వారికా అవకాశం యివ్వకూడదు రైతులకు కావలసిన వస్తువుల ధరలతో పోల్చినప్పుడు ఆ నిష్పత్తిలో వారు అమ్మే పంట ధర వుండడంలేదు రైతుల భూమికి కావలసిన నీటి వసతులు, ధనం, ఎరువులు సమముగా సరఫరా చేయకపోతే వ్యవసాయ ఉత్పత్తి భవిష్యత్తులో దెబ్బ తింటుంది. మరొకవైపున పన్నులు విధిస్తున్నాం ఆదిలాబాదులో పండినది హైదరాబాదుకు రావాలంటే గ్రామకమిటీలు రెండు రూపాయలు Motor Vehicle Tax అని వసూలుచేస్తారు ఆ విధముగానే petrol tax, market tax, municipal taxes వున్నాయి భూమిపైన నీటిపైన వేయబడే పన్నులనన్నిటినీ కలుపుకొని చూస్తే రైతుదేమీ తప్పులేదు ధరలు పెరిగిపోతే దాని బాధ్యత ప్రభుత్వంపైన, middle men పైన వుందని స్పష్టమవుతుంది కాని దీనికి రైతు మూలకారకుడనుకోకూడదు పన్నులు రెండు రూపాయలు వేశామంటే వర్తకులు నాలుగు రూపాయలు, 10 రూపాయలు తీసుకోడానికి ప్రయత్నం చేస్తారు అటువంటి అవకాశాలు ఎవ్వరికీలేకుండా రైతుకు కావలసినవస్తువులు సరసమైన ధరలకు దొరికేటట్లుచేసి ప్రభుత్వపక్షాన వారికి సహాయంచేసినట్లయితే ఆహార ధాన్యాల ధరలు పెరిగిపోవని నేను హామీయిస్తున్నాను

*శ్రీ కె. నరసయ్య (సిరిసిల్ల రిజర్వుడు) : అధ్యక్షా, చాలామంది సభ్యులు ఆహార సమస్యపై మాట్లాడుతూ వారి వారి నియోజక వర్గములలో ప్రజలు పడుచున్న కష్టసుఖములను వివరించారు వర్షములవలన అనేక ప్రాంతముల లోని పంటలకు నష్టము కలిగినది. ఏ ఏ ప్రాంతములో పంటలు దెబ్బతిన్నవో పేపర్లలో వివరంగా తెలుస్తున్నది. కాని మంత్రిగారు ఇచ్చిన రిపోర్టును బట్టి ఆ రిపోర్టును ఆ ప్రాంతంలోని అధికారులుకాని, తహసీల్దారుకాని తమ గదిలో కూర్చుండి, యదార్థ పరిస్థితులు తెలుసుకోకుండా తమకు తోచినవిధంగా ఏదో వ్రాసినట్లుగా తోస్తున్నది. ఈ సంవత్సరము నాట్లు ఆలస్యముగా వేయటం జరిగింది. కుంటలలో నీరులేక మెట్ట ప్రాంతములో పంటలు సరిగా పండలేదు.

కుంటలలో నీరు నిండుగా వున్నప్పుడే పంటలు సరిగా పండుతవి వేరుసెనగ, జొన్న, నువ్వులు మొదలైనవన్నీ ఈ సంవత్సరము సగానికి సగము తగ్గిపోయినవి పంటలు తగ్గటం ధరలు పెరగటంవలన ఏర్పడే భయంకరమైన కరువు వలన తాము ఏలా బ్రతుకుతామో అని ప్రజలు భయపడుతున్నారు కాని ఎక్కడ పంటలు చెడిపోయినాయో అక్కడి ప్రజలకు కావలసిన సౌకర్యములు, కలుగచేయటానికి మంత్రివర్గం శ్రద్ధ తీసుకొనటంలేదు ఏడ్చేవారి కండ్లను తుడిచినట్లుగా ఏదో బుజ్జగించే మాటలు నాలుగుచెప్పి కాలక్షేపం చేయటానికి ఈ ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది ప్రజల కష్టసుఖాలను విచారించి వారి ఆదరాభిమానాలను చూరగొనటానికి ఈ ప్రభుత్వము ప్రయత్నించటంలేదు ఏ విషయము చెప్పినా, ఏదోవిని, ఏదో సమాధానం చెబుతూ కాలక్షేపం చేస్తున్నారు అని నేను భావిస్తున్నాను కనుక ప్రజల కష్టసుఖాలను శ్రద్ధగా విచారించి, వారి సమస్యలను పరిష్కరించటానికి తగిన చర్యలు తీసుకోవాలని, పంటలు దెబ్బతిన్న ప్రాంతాల వారికి ఇతర పన్నులు, అప్పులు మాఫీచేసి ప్రజలకు సహాయపడాలని మంత్రివర్గానికి విజ్ఞప్తి చేస్తూ నేను సెలవు తీసుకొంటున్నాను

శ్రీ కె. కృష్ణమాచారి (సంగారెడ్డి - జనరల్) అధ్యక్షా ! ఈ రాష్ట్రములోని ఆహార సమస్యగురించి పరిశీలించేటప్పుడు నాకొకవిషయం గోచరిస్తున్నది రెండు ప్రభుత్వముల మధ్యా రైతు నలిగిపోతున్నట్లుగా తోస్తున్నది ప్రకృతి సిద్ధంగా ఒకసారి అతివృష్టివలన, మరియొకసారి అనావృష్టివలన ఆహార ఉత్పత్తి సక్రమముగా జరుగుటలేదు ఈ విషయములో మన ప్రభుత్వము ఏవిధమైన జోక్యం కల్గించుకొనేస్థితిలోలేదు అతివృష్టి, అనావృష్టులవలన నష్టం జరుగుతూ వుంటుంది మన మంత్రులు నిర్వర్తించవలసిన బాధ్యతలు కూడా కొన్ని వున్నాయి ధాన్యం ధర తగ్గాలంటే ఉత్పత్తి అధికమై వ్యవసాయము సక్రమముగా జరగాలి ఇప్పుడు ఆహార సమస్య క్లిష్టముగా వుంది ఆంధ్రలోకన్న తెలంగాణాలో మరీ హీనముగా వుంది ఆ విషయంగురించి ప్రభుత్వ దృష్టికి కొన్ని సూచనలు తీసుకురాదలచాను ఆ సూచనలను కొద్దిగానైనా నిర్మాణాత్మకంగా ఆలోచించినట్టయితే ఆహారసమస్య కొద్దిగానైనా బాగుపడవచ్చుననే అభిప్రాయం నాకు దృఢంగా వుంది. మా జిల్లాగురించి నాకు అనుభవంవున్నంత వరకు మనవిచేస్తున్నాను. పెద్దపెద్ద భూస్వాములకే ఈనాడు తక్కావీ అప్పులు దొరకుతున్నాయి వారు రుణంతీసుకోకుండా కూడా ఎన్నివేలయినా ఖర్చు పెట్టగలరు. కాని ప్రభుత్వం దగ్గర పైరవి - పైరవి చేసి, ఆఫీసుల చుట్టు 10, 20 సార్లయినా తిరిగి అప్పులు తీసికొంటాము. కాన ఆ తక్కావి అప్పులు సామాన్య రైతాంగానికి లభ్యంకావటములేదు. అటువంటి తక్కావి అప్పులు సరైన సమయంలో రైతులకు లభించేటట్లు ప్రభుత్వం చూడాలని కోరుతున్నాను.

తెలంగాణాలోని ఏ జిల్లాలో కూడా రైతుకు సులభంగా ఎరువులు లభించటము లేదు పైరవి చేసుకొన్న పెద్దపెద్ద రైతులకు భూస్వాములకే ఆ ఎరువులు దొరుకుతూ ఉంటాయి రైతులకు ఎరువులు దొరకని కేసులు ఏూ మెదక్ జిల్లాలో చాలా వున్నాయి కొన్నిదినముల క్రితమే వ్యవసాయ మంత్రిగారికి ఒక పిటిషన్ వచ్చివుండవచ్చును గవర్నమెంటు గాయిరాన్ భూమి తన స్వంత భూమి అని మోసముచేసి కొన్నివేల రూపాయల ఎరువులను తీసుకొన్నారు అవి బ్లాక్‌మార్కెటులో అక్కడ విక్రయించబడినాయి ఇటువంటి సమస్యలు ఎన్నో వస్తూవుంటాయి వాటిని ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలించాలని నేను మనవి చేస్తున్నాను

నాకు ఒక్కవిషయం చాలా ఆశ్చర్యంగా కనబడుతున్నది ప్రతిజిల్లాలోను కూడా ఈ అగ్రికల్చర్ డిపార్టుమెంట్సు ఈ కాలంలో కూడా కేవలం రాజ రీవితోనే నడుస్తున్నాయని మీతో మనవిచేస్తున్నాను అగ్రికల్చర్ డిపార్టుమెంటు సామాన్యరైతులకు అందుబాటులో వుండాలి. అధికారులు, సామాన్యరైతులు కలసిమెలసి వుండాలి ఈ డిపార్టుమెంటు రైతులకొరకు పనిచేస్తాయనేవిషయం అధికారులు రైతులకు తెలపాలి కాని నేను యింతకుముందే చెప్పినట్లు వ్యవసాయశాఖలు రాజరీవితోనే పనిచేస్తున్నాయి

*[ Mr Speaker in the Chair ]*

సామాన్యమైన రైతాంగం ఈ డిపార్టుమెంటుకు వెళ్ళి లాభం పొందుట లేదు. లాభంపొందే అవకాశాలు ఈ అధికారులు వారికి కల్గించడంలేదనేది కూడా నిర్వివాదాంశమని నేను మనవిచేస్తున్నాను వ్యవసాయం అభివృద్ధి కావాలంటే ఈ డిపార్టుమెంటు ఏ దృష్టితో, ఏ దృక్పథంతో ఏర్పడ్డాయో ఆ దృక్పథాలను అమలులోకి తేవాలి ఆ అధికారులు ప్రజలలోనికి చొచ్చుకొని పోయి, వారితో కలసిమెలసి, వారి అభిప్రాయాలను సేకరించి వారికి సలహో లివ్వాలనే విధానం దృష్టియందుంచుకొని, వెనుకటి రాజరీవి అయినా కనీసం విడిచిపెట్టాలని నేను ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను.

తెలంగాణా ప్రాంతంలో వందలకొలదీ, వేలకొలదీ చెరువులు, కుంటలు ఉన్నాయి. వాటిక్రింద సేద్యానికి పనికివచ్చే భూమిలేదు కాని ప్రభుత్వం ఉత్తరువులవల్ల శికింతాలాబు అనబడే చెరువులలో క్రింద వుండేభూమిని సేద్యం చేయరాదు, సేద్యం చేయనివ్వరాదు అనేవిషయంలో ఆ భూములన్నీ నిరర్థకంగా పడావాబడుతున్నాయి. సాగుచేయడానికి వీలులేని చెరువులలో వుండే భూమినైనా రైతులకు యివ్వడం చాలా ముఖ్యమని మనవిచేస్తున్నాను అంతేకాకుండా వందసంవత్సరాలుగా చెడిపోయిన చెరువులు చాలాఉన్నాయి.

ప్రభుత్వంవారు లోటు బడ్జట్ వల్లనో, మరేకారణంవల్లనో వాటిని బాగు చేయించడంలేదు అందువల్ల ప్రజలు బాగుచేసికొంటే వాళ్ళ land assessment నుంచి కొంత మినహాయించే కనీసపర్పాటైనా చేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను

అంతేకాక యింకొకవిషయం కూడా ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను హైదరాబాదులో Inam Abolition Act క్రింద ఈనాముభూములను ప్రభుత్వం స్వాధీనం చేసికొంది. ఈనాందారు లాభం పొందుతున్నాడు కాని, ఆ భూములు మాత్రం ప్రభుత్వానివి అనే భావించబడుతున్నాయి తెలంగాణాలో ప్రతి గ్రామంలోనూ ఇట్టివి చాలా ఇనాము లున్నాయి ఈనాంభూములంటే నిజానికి పనికిరాని భూములు అని అర్థం ఆ భూములను బాగుచేసుకోడానికి Co-operative Banks నుంచి గాని, Land Mortgage Banks నుంచిగాని లేక ప్రభుత్వం యిచ్చే తక్కావి అప్పులుగాని తీసుకోవాలంటే ఆ భూములను తాకట్టుపెట్టడానికి వీలులేదు ప్రభుత్వం వాటికి తక్కావీ అప్పులుగాని ఎరువులు గాని యివ్వుటలేదు ఇట్లా ఆ ఈనాంలను తాకట్టు పెట్టుకోడానికి వీలులేదు, కనుక ఈనాందారులు చాలా బాధలు పడుతున్నారు అందువల్ల ఈ భూములను తాకట్టు పెట్టుకొందుకు అనుమతించాలి. ఇంకా ఎరువులు యిప్పించే ప్రయత్నాలు చేయడం చాలామంచిది

తెలంగాణాలో వందలకొలది ఎకరాలనుంచి గల్లా గోదాములద్వారా ధాన్యం సేకరింపబడి ఉండేది ప్రతి గ్రామంలోనూ ఈ విధానం ఉన్నట్లు నేను చెప్పగలను ఆ గల్లా గోదామువాళ్ళు ఎక్కడధాన్యం అక్కడే స్వంత ముకు పెట్టుకొని కూర్చున్నారు. ఈ విషయం ప్రభుత్వానికి ఎన్నోసార్లు తెలుప బడినది అధికారాలు ఈ గల్లా గోదాముల విషయం పరిశీలించడం గాని, విష యాలు సేకరించి తగిన చర్యలు గైకొనడంగాని జరగడంలేదు. ఒక్కొక్క జిల్లాలో 100 పుట్ల ధాన్యంకూడా గ్రామస్థులు తినేసి కూర్చున్నారనే విషయం ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను ఈవిధంగా యింకా ఎన్నో విషయాలున్నాయి. వీటిని ప్రభుత్వంవారు దృష్టిలో పెట్టుకోవాలి. ఈ చౌక డిపోలు మొదలైన విషయాలలో నాకు అంతపట్టింపులేదు ఏదో 1, 2, 3, 4 గ్రామాలలో దాన ధర్మాలుచేసి దేశాన్ని ఉద్ధరిస్తాము, ఆహార సమస్యను తగ్గిస్తాము అనే విషయం నాకు హర్షనీయంగా లేదు ఇది జరగాలి, జరిగితే మంచిదే, కాని ఆహార సమస్య తీర్చాలంటే ధరలు తగ్గాలంటే ఉత్పత్తి పెంచాలి ఈ ఉత్పత్తిని పెంచేందుకు సర్వవిధాలా ప్రయత్నాలు చేయాలని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

*శ్రీ పి. నరసింగరావు (హుజూరాబాద్ - జనరల్) అధ్యక్షా, మన రాష్ట్రంలోని ఆహార పరిస్థితినిగురించి మన వ్యవసాయశాఖా మంత్రిగారు ఒక statement ను సభముందు ప్రవేశపెట్టారు 1956-'57 సం॥లో మన రాష్ట్రం surplus రాష్ట్రంగా ఉన్నట్లు వారు ఆ statement లో చిత్రించారు మంత్రి గారు తీసుకువచ్చిన figures. Bureau of Statistics and Economics వారు యిచ్చిన Bulletin లోని figures— ఈ రెండింటినీ తీసుకొని compare చేసి చూచినట్లయితే మనం ఈ statistics ను ఎంతవరకూ నమ్మాలనేది రుజువు అవుతుంది మంత్రిగారు యిచ్చిన statement ప్రకారం 1956-57 సం॥లో 184 66 లక్షల ఎకరాల భూమి సేద్యం అయినట్లు, దానిపంట అంచనా 54 26 లక్షల టన్నులు అని చూపించారు 1953-54 సం॥లో పండినంత పంట ఈ మధ్య 5, 6 సం॥ల నుంచి ఎప్పుడూ పండలేదని అందరూ ఒప్పుకొనక తప్పదు ఇది అందరకూ అనుభవంలోవున్న విషయం 1953-54 సం॥లో మొత్తం సేద్యం చేయబడిన ఎకరాలు 188 32 లక్షలు ఆ సంవత్సరం పంట బాగా పండినా 54,38,000 టన్నులు మాత్రమే కాని యిప్పటి అంచనా ప్రకారం acreage తగ్గింది దాదాపు 4 లక్షల ఎకరాలకంటె ఎక్కువ ఎకరాలు, సేద్యం తగ్గినట్లు చూపించారు పంట మాత్రం 54 లక్షల 26 టన్నులు ఎక్కువ అయినట్లు చూపించారు ఇదే statement లో రెండవ వైపున చాలా ప్రాంతాలలో, జిల్లాలలో వర్షాలు బాగాలేవనీ, పైగా వర్షాలులేని జిల్లలను జిల్లాల వారీగా చూపించారు ఈ విషయంలో ఒకదానికీ, ఇంకొకదానికీ ఎంత contradictory గా ఉన్నదో మనకు అర్థం అవుతుంది మన రాష్ట్రంలో ఉన్న statistics ను తీసుకొని ఈ వ్యవహారాన్ని పరిశీలించినట్లయితే ఈ పరిస్థితి ఏర్పడదు. పంచవర్ష ప్రణాళికలో కేవలం వ్యవసాయం మీదనే దృష్టి కేంద్రీకరించి వ్యవసాయాభివృద్ధికొరకు కోట్లకొలది రూపాయలు ఖర్చుచేస్తే అంత surplus కాకపోయినా— కనీసం self sufficiency అయినా కలుగుతుందని అంచనా వేయబడినది ఈనాడు దేశంలోని పలు ప్రాంతాలనుంచి కరువుతో బాధపడుతున్నట్లు వార్తలు వస్తున్నాయి శ్రీకాకుళం జిల్లాలోనూ, అదిలాబాద్ జిల్లాలోనూ— ఇంకా ఆంధ్రలో ఏయే జిల్లాలలోని పరిస్థితి ఎట్లాఉన్నదో నాగిరెడ్డిగారు చెప్పారు ఈ విషయాలన్నింటినీ దృష్టిలో పెట్టుకొని ఆలోచించితే, ఇప్పుడు మంత్రిగారుయిచ్చిన లెక్కలప్రకారం below normal rainfall ఉన్నప్రాంతాలు చూపించినట్లుగా normal rainfall ఎక్కడైనా ఉన్నదా అనేది చూపించలేదు. పంటల పరిస్థితికూడా అదేవిధంగా ఉన్నదని చూపిస్తున్నారు ఈ సంవత్సరంవర్షాలు తక్కువగాకురిసినాయి. కురిసినా, సకాలంలోకురవలేదు. మొదటి విషయం అసలు మంత్రిగారు వేసిన estimate తప్పు 4వ వంతు అనేది తీసుకున్నా 4 వంతు deduct చేసినట్లయితే మొత్తానికి 40,69,500 టన్నుల

ధాన్యం ఉంటుంది వారి ఎస్టిమేటు ప్రకారమే తీసుకుంటే మనకు యింకా 49 05 లక్షల టన్నులు అవసరం ఈ లెక్కలను తీసుకున్నా 35 21 లక్షల టన్నులు లోటుఉన్నది సర్ప్లస్ ప్రాంతమనబడే మన ఆంధ్రప్రదేశ్‌లో deficit ఉన్నట్లు రుజువు అవుతున్నది

ఈవిధంగా కేవలం ఈ statistics పై ఆధారపడి మనదేశంలో ఆహార పరిస్థితిని తెలియచేసేందుకు Government కు ఒక policy అవసరం కాని ఆ statastics లో మనం surplus అని చిత్రించటం జరుగుతోంది కాని మనకు ఆహార ధాన్యాలు surplus గా లేవు ఇంకొక దృష్టితో ఇంకొక లెక్కప్రకారం చూచినట్లయితే deficit అనే అనవచ్చు దీనికి కారణాలు ఏమిటో ఇపుడు ఆలోచించాలి ప్రభుత్వం, ఆహార పంటలను ఎక్కువగా పండించుటకు, ముఖ్యంగా major irrigation, minor irrigation, medium irrigation schemes ను అభివృద్ధిచేయాలని కోట్లకొలది రూపాయలను ఖర్చుపెడుతున్నది కాని ఆ ప్రణాళికలను క్రమబద్ధంగా ఆలోచించాలి. ఒక ప్రాజెక్టును మనం నిర్మాణం చేసేటట్లుగా ఉంటే ఆ ప్రాజెక్టు క్రింద నున్న భూమిని సాగుకు తీసుకురావడానికి రైతులకు కావలసిన credit facilities కాని, ఇంకా ఇతర facilities కాని ఏ విధంగా కల్పించాలనేది ఆలోచించకుండా కేవలం ఏదో ఒక పెద్దప్రాజెక్టును మనం నిర్మిస్తున్నామని అనుకోవడం తప్పితే ఆ ప్రాజెక్టు వలన వీలైనంత తొందరగా సత్ఫలితాలు కలగాలని ఆలోచించడంలేదు అందువల్ల పెద్ద పెద్ద ప్రాజెక్టులు కట్టడంజరుగుతోంది కాని, వాటివల్ల భూమి సాగయి సత్ఫలితాలు వెంటనే కలుగుటలేదు ఒకసారి శ్రీ ఎస్. కె పాటిల్ గారు పార్లమెంట్‌లో జవాబు చెప్తూ ఒక statment ఇచ్చారు "It is a matter of shame that out of 6 3 million acres to be irrigated only 4 million acres are irrigated" అని పంచవర్ష ప్రణాళిక ప్రకారం అసలు 6 3 మిలియన్‌ల ఎకరములను irrigate చేయాలని వారనుకున్నారు కాని irrigate అయినది మాత్రం కేవలం 4 మిలియన్ల ఎకరములు మాత్రమే అంటే దగ్గర దగ్గర 50 percent irrigate కాకుండా ఉండిపోయినదన్నమాట 50 percent మాత్రమే irrigate అయిన దన్నమాట. అంటే, అదేపరిస్థితి మన ఆంధ్రదేశానికికూడా వర్తిస్తుంది. ఈమధ్య తుంగభద్ర నీరు ఏవిధంగానూ utilise కావడంలేదు, ఇంకా కడం ప్రాజక్టు యొక్క నీరు ఏవిధంగానూ utilise కావడంలేదు అనే విషయాల గురించి మనం ఆలోచించితే ప్రణాళికలను తప్పుడు statistics, తప్పుడు అంచనాలమీద మనం తయారుచేసినట్లు తేలుతుంది దీనికి priority ఇవ్వాలా లేదా అని ; వాటిని comprehensive గా చర్చించి, దాని మంచి చెడుగులను, బాగోగులను ఆలోచించకుండా ప్లాన్‌లు వేయడం జరిగింది. అందువల్ల లక్షలకొలది, కోట్ల కొలది రూపాయలు ఖర్చవుతున్నాయి. కాని సత్ఫలితాలు మనకు రావడం

లేదనే విషయం దీనివల్ల రుజువగుచున్నది ఇది పంటకు సంబంధించినంతవరకు మాత్రమే ఇకపోతే ధరల విషయం చూద్దాం ధరల గురించి ఈ ప్రభుత్వానికి ఒక policy, ఒక నీతి అనేవి లేవు ఏదో పెద్దపెద్ద పట్టణాలలో కార్మికులు బాగా అల్లరిచేసినపుడు, ధరలు బాగా పెరిగిపోతున్నాయి అన్నప్పుడు, సమ్మెలని, గిమ్మెలని బెదరించినపుడు ఏవో controls అనో, requisition అనో ఏదో ఒకటి తీసుకురావడం, మళ్లీ ఒకసారి రైతులు ధరలు పూర్తిగా పడిపోతున్నాయి, దిగిపోతున్నాయని గోలపెట్టినపుడు, మళ్లీ మేము ఒకేధరకు కొంటామని చెప్పి ఒక ceiling ను నిర్ణయించడం మాత్రం జరుగుతున్నది ఆ ceiling ఎన్నటికీ కూడా రాదు కొనటం అనేదే జరగదు గత సంవత్సరం ఇదేవిధంగా ధరలు పడిపోయినపుడు రైతులందరూ మొరపెట్టుకుంటే ఏదో ceiling price మాత్రం నిర్ణయించారు కాని ఆ price కు మాత్రం ప్రభుత్వం ఏమైనా కొనగలిగినదా ? రెండవది మంత్రిగారిచ్చిన లెక్కల ప్రకారంగా industrial goods యొక్క prices మన agricultural goods యొక్క prices కన్న చాలా ఎక్కువగా ఉన్నాయి Industrial goods యొక్క prices, agricultural goods యొక్క prices ను reach కావడంలేదు, అని కూడా వారు justify చేస్తున్నారు కాని ఈ విధంగా ఇంత సామ్యం ఏమిటి ? ఈవిధంగా ఉంటే ఒకవైపు ధరలు విపరీతంగా పెరిగిపోతున్నాయని ప్రజలంటున్నారు, అనుభవిస్తున్నారు రెండవవైపున రైతులేమో మాకు ధరలురావడంలేదని అంటున్నారు దీనివల్ల మధ్య దళారీలు బాగా లాభంపొందుతున్నారని వేరే చెప్పనవసరంలేదు మనం market price ను index గా తీసుకొనేటట్లయితే- పంట market లోనికి harvest season లో వచ్చినపుడు ధరలు చాలా తక్కువగావుండడం, harvest season అయిపోయి,సామాన్య రైతుల దగ్గర నుంచి పంటంతా మధ్యవ్యాపారస్థుల చేతులలో పడిపోయినాక నెలకో, రెండునెలలకో పూర్తిగా ఒకసారే ధరలు rise కావడంకూడా జరుగుతోంది ఈ సందర్భంలో Congress Parliamentary Committee ఆహారపరిస్థితి విషయంమీద comment చేశారు ఆ commentary గురించికూడా నేను ఇక్కడ చెప్పదలుచుకున్నాను అది ఈ విధంగా ఉంది "The dealers profit over the prices to the growers of food ranges from 30 to 200 per cent, but in other Countries it is 15 to 20 percent only" రైతులదగ్గర తక్కువ ధరలకు కొనడం జరుగుతోంది, కాని ఆ కొన్న ధాన్యాన్ని consumers కు అమ్మేటపుడు మాత్రం 30 నుంచి 200 percent దాకా vary కావడం జరుగుతోంది. ఇది Congress Parliamentary Sub-Committee వారిచ్చిన రిపోర్టు. ఈ విషయం అందరికీ తెలుసు, కాంగ్రెస్ పార్టీవారికి కూడా తెలుసు కాని, కాంగ్రెస్‌కు పెద్దపెద్ద పెట్టుబడిదారుల, వ్యాపారస్థుల చెప్పుచేతులలో మసలుకోవలసిన అవసరం ఉన్నది. కాబట్టి ఎప్పుడూ ఒక నిర్దుష్టమైన price

నిర్ణయించడమనే విషయంలో ప్రభుత్వానికి ఒక policy అనేది లేకుండా ఉన్నది Harvest season తదుపరి ఎంతభేదమైతే ఉన్నదో దానిని దూరంచేసి ఒకేవిధమైన parity ని నిర్మాణం చేయటానికి ప్రభుత్వం ఆలోచించాలి, ఒకే parity అనే దానిని maintain చేయాలి ఏ difference అయినా, 5, 10, 15 percent వరకుకూడా ఉన్నా దానివల్ల నష్టమేమీలేదు కాని 200 percent వరకు కాని, 100 percent వరకు కాని ఎక్కువగా ఉన్నట్లయితే దాని ఫలితమేమవుతుంది ? ఎప్పటికీ మధ్య ఈ దళారీలే లాభపడుతారు కాని, ఇటువైపు రైతులు లాభపడరు, అటువైపు consumers లాభపడరు ఈ ఇద్దర్నీ సంతృప్తిపరచకుండా కేవలం కొద్దిమంది పెట్టుబడిదారులను సంతృప్తి పరచేందుకే ఈ ప్రభుత్వానికి price policy అనేది లేకుండా ఉన్నది కాబట్టి యిటువంటి parity ని నెలకొల్పడానికి ఎంతవరకైతే ప్రభుత్వం ఒక ఖచ్చితమైన policy ని ఏర్పాటు చేయదో అంతవరకు ఈ food సమస్య దేశంలో పరిష్కారంకాదు అంతవరకు, మన ప్రణాళిక విజయవంతం కావడానికి వీలుండదు కాబట్టి అటువంటి parity ని నెలకొల్పాలని మంత్రిగారికి నేను మనవి చేస్తున్నాను

* శ్రీ పి ఎన్. అప్పారావు అధ్యక్షా, మన Minister గారు యిచ్చినటువంటి statement అంతా చూచాను ఆ స్టేట్ మెంట్ చాలా బాగుంది వారి స్టేట్ మెంట్ లో యిచ్చిన అంకెలలో మెరకపంటలు 70 percent ఉంటుంది అన్నారు కాని ఈ సంవత్సరంలో పంట, చోళ్లు, రాగులు మొదలైన పంటలు 20 percent కంటే హెచ్చు పండలేదని నేను మంత్రిగారికి మనవి చేస్తున్నాను వర్షాలు లేనికారణంచేత ఈ మెరకపంటలు చాలా తక్కువగా పండినవి మెరకపంటలంటే, చోళ్ళు, జొన్నలు, రాగులు మొదలైనవి పల్లపు పంటలకు ఈమధ్యనే October లో ఊడ్పులైనాయి. October లో ఊడ్చినటువంటి పల్లపుపంటలు అప్పుడే పంటకురావని అంటున్నాను. అక్టోబర్ లో ఊడిస్తే ఇప్పుడు సగం వెన్నులు, కొన్నిటికి గింజలు వేస్తూంటాయి కొన్నిటికి గింజలేరావు. ఈ పరిస్థితిలో పల్లపుపంటలు ఉంటాయి దానికితోడు వర్షాలు కూడా లేవు అసలు ఈ సందర్భంలో దురదృష్టవశాత్తూ Food Minister గారు ఉన్నట్లుగా మన Irrigation Minister గారు ఇక్కడలేరు వారు లేకపోవడమనేటటువంటిది చాలా విచారకరమైన విషయమని నేను మీకు మనవి చేస్తున్నాను. అసలు ఈ food situation కు సంబంధించిన ఈ motion లో వారిద్దరికీ సమానబాధ్యత ఉన్నది. ఇవుడు minor irrigation grants ఇచ్చారు. Last year యిచ్చినటువంటి grant లో రెవిన్యూవారు ఎంత ఖర్చుపెట్టారు అనేవిషయం ఒకటి ముఖ్యంగా చూడవలసినదని మనవిచేస్తున్నాను ఎందుచేతనంటే, వారు యిచ్చిన grant లక్షలు అనేపేరే కన్పిస్తుంది, కాని ఖర్చు

చేయడంమటుకు చాలా తక్కువ ఉంటుందని మనవి చేస్తున్నాను అసలు **tanks** కు మరమ్మత్తు చేయకపోతే ఆ పడే వర్షాలనీరు ఉండడానికైనా అవకాశం ఉండదని మనవి చేస్తున్నాను ఆ డబ్బునంతనూ పూర్తిగా ఖర్చుపెట్టి **tanks** కు **rapairs** చేసిననాడె చెరువులన్నీ నిండడం కన్పిస్తుంది ఈ మరమ్మత్తులకు ఇన్నిలక్షల రూపాయలు యిస్తున్నామని మీరు చెప్తున్నారు కాని ఇచ్చే డబ్బులో 30 **percent** అయినాకూడా **officers** ఖర్చుపెట్టకుండా ఉన్నారు, ఆ **grant** చేయడంకూడా ఎపుడు చేస్తున్నారు ? సరిగా మార్చి నెలలో ఏ 20 వ తారీకునో "మీకు 3 లక్షల రూపాయలిస్తున్నాము మీరు ఖర్చుపెట్ట వలసినదని ఇక్కడనుంచి ధన్ మని ఒక ఆర్డర్ పంపిస్తున్నారు ఉద్యోగస్తులను, "మీరు ఈ మూడు లక్షలరూపాయిలను, ఖర్చు పెట్టాలంటే" వాళ్ళను తినేయ మని అర్థమా ? లేక **tanks** క్రింద **work** చేయమని అర్థమా ? **Works** అన్ని జాగ్రత్తగా కావాలంటే సరైన **time** లో **grant** యివ్వాలి వాళ్ళను పట్టుకొని 'మీరు జాగ్రత్తగా పనిచేయించా' లని చెప్పాలి ఆ బాధ్యత **Irrigation Minister** గారి మీదకూడా ఉన్నది కాబట్టి వారుకూడా ఉంటే చాలా సంతోషంగా ఉండిఉండేది. వారికి కూడా ఈ విషయాలన్నీ తెలియచేయాలని నేను మనవిచేస్తున్నాను ఇక పంటలన్నిచోట్ల పూర్తిగా పోయినాయి ప్రతిచోట కూడా ఈ **Fair Price Shops** ను పెట్టాలి ఈ **Fair Price Shops** ను పెట్టాలి అనే దానికి ముఖ్యంగా కారణం లేబర్‌గా కన్పిస్తుంది **Labour** ఉన్నదంటే వారికి పంటలు తక్కువగా పండేవాళ్ళకు పనిలేకుండా ఉంటూఉంది ఇంతవరకు ఎకరానికి 20 బస్తాలు పండిస్తున్నటువంటిదానికి 20 మంది కూలీలు ఉండేవారు. ఇపుడు తక్కువపంట పండడంచేత కూలీలకు **work** లేదు, కాబట్టి ముఖ్యంగా కరువుపనులను ప్రారంభించాలి. పంటలు పండితేకదా రైతు కూలీకి **labour** చూపించడానికి వీలుంటుంది ఎపుడైతే పంటపండలేదో, అపుడు వాళ్ళకు కూలీలేదు 10 మంది చేయవలసినపనిని 4 గురు కూలీలచేత చేయించుకుంటున్నారు. మిగతా 6 గురికి కూడా భోజనము లేదు అందువలన ముఖ్యంగా కరువుపనులను అన్ని జిల్లాలలోను హెచ్చుగా ప్రారంభించాలి మా శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు మెరకజిల్లాలు కాబట్టి వాటిలో ముందుగా కరువు పనులను ప్రారంభించవలెనని నేను మంత్రిగారికి మనవి చేస్తున్నాను

కాలువనీరు వుండేభూములు 15% కంటే ఎక్కువలేవు మిగిలినదంతా మెరకభూమే కృష్ణా, గోదావరి జిల్లాలలోతప్ప మిగిలినదంతా మెరకభూమే ఎక్కువగా మైనర్ యిరిగేషన్‌వర్క్సు చేయించాలి అవి చేయించేలోపున కరువుపరిస్థితిని తగ్గించడానికి **fair price shops** ను పెట్టాలి. **Shops** పెట్టినట్లయితే ఒక్క రైతులకేకాదు. మధ్యరకపు ప్రజలకూ, **N. G. O.** లకూ,

ఇతర ఉద్యోగస్థులకూ, కూలీలకూ అందరకూ ఉపయోగం ఉంటుందని మనవి చేస్తున్నాను గోగునార, వేరుశనగ, చెఱకు పంటలున్నాయి చెఱకుకు 12 నెలలూ కూడా నీరుఉండాలి గోగుచెట్లకు నీరు లేకపోవడంవల్ల ఎక్కడికక్కడ ఎండిపోతున్నాయి, ఏవిధంగానైనా గోగుచెట్లను కోసి, నీటిలో ఊరవేస్తేనే కాని పనికిరాదు 15 రోజులకుపైగా నీటిలోఉండాలి ఈ నారవిషయంలో శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు రెండూకూడా చాలా నష్టపోయాయి ఇక వేరుశెనగ చేలు వేశారు

సెప్టెంబరు, అక్టోబరు నెలలలో కొంతవరకూ వర్షాలు పడినాయి ఆ వర్షాలవల్ల చేలు తయారయినాయి. ఇప్పుడు వాటిని తీయడానికి నీరులేని కారణంగా అవకాశంలేదు నూతులు త్రవ్వుకొని నీరు తెచ్చుకోవలసియున్నది ఒకవేళ తీసినా సగంభూమిలోనే వుంటుంది దానివల్ల రైతుకు వచ్చేలాభం ఏమీలేదు ప్రభుత్వంవారు సదుద్దేశంతోనే రైతులకు ఋణాలు యిస్తున్నారు కాని నూటికి రు 25 లు లంచాలు యిస్తేనేగాని ఉద్యోగులు యివ్వడంలేదు ప్రభుత్వంవారు యిచ్చే 10 బస్తాల ఎరువులో 2 బస్తాల విలువగల సొమ్ము అక్కడ ఖర్చుచేస్తేనేగాని ఆ 10 బస్తాలు రైతుకు రాకుండా ఉన్నాయి. ఇచ్చే ఎరువులో రు 100 లు permit కు ఖర్చుచేసి రు 1000 ల ఎరువులు ఋణాలక్రింద తీసుకొంటే ఆ permits యింకొక షాహుకారుకు యిస్తున్నారు ఆ షాహుకారు ప్రభుత్వంవారి depot లోనో, marketing society దగ్గరో manure లేనటువంటి సమయంలో బస్తాకు రు 3, 4 లు హెచ్చురేటుపెట్టి అమ్మడానికి అవకాశం కల్పిస్తున్నాడు ఈ విషయం ప్రభుత్వంవారు జాగ్రతగా చూడవలసియున్నదని మనవిచేస్తున్నాను ఈ transfer ఆపాలి అగ్రికల్చర్ డిపార్టుమెంటు మొట్టమొదలే పూచీకత్తు చెల్లిస్తేకాని permit యివ్వరు ఎక్కువ డబ్బువుండి బాగా వాణీలు వెసుకొని వెడితేగాని యివ్వరు అందువల్ల actual గా కావలసినవానికి డబ్బు దొరకడంలేదు డబ్బుఉన్నవారే తీసుకొంటున్నారు. కావాలంటే ప్రభుత్వంవారు పరిశీలన చేయవచ్చు. డబ్బు ఉన్నవాడను నేనువెడితేనే యిస్తున్నారు కాని, పేదవాడు వెడితే అతనికి అవసరం ఉందా, లేదా అనేది ఆలోచించుటలేదు ఇచ్చుటలేదు లంచగొండితనాన్ని పూర్తిగా నిర్మూలించి రైతులకు తగినసౌకర్యాలు కలుగచేయవలసిందని కోరుతూ, ఈ విషయాలు చెప్పడానికి అవకాశం యిచ్చిన అధ్యక్షులవారికి నమస్కారం పెడుతూ నేను విరమిస్తున్నాను

*శ్రీ కె. సీతయ్య గుప్త (ముషీరాబాద్) : అధ్యక్షా, ఈనాడు ఆహారపరిస్థితిపైన చాలామంది సభ్యులు మాట్లాడారు ఆహారమంత్రి తిమ్మారెడ్డిగారు కూడా ఒక statement యిచ్చారు. అది చాలా సమంజసంగానే యున్నది. అయితే, zonal system విషయంలో వారి అభిప్రాయమేమీ తెలుపలేదు. దాని

పరిణామం ఏమిటి ? ఇకముందు దాని పరిణామం ఏమి కాబోతున్నది ? అనే విషయం ఏమాత్రంకూడా తెలియజేయలేదు ఈ zonal system అనేది ఇంకొక విధమైన rationing system అని చెప్పవచ్చు " ఈ rationing చాలా అనర్థదాయకము, మన భారతీయులకు ఒక నల్లనిమచ్చ, దానిగురించి మనలో ఒక విధమైన moral standard పడిపోయింది, అదివద్దని" మహాత్మాగాంధీ చెప్పారు కాని అప్పటి ప్రభుత్వం మొదట అంగీకరించకున్నా, మనం తరువాత ఒప్పుకొన్నాము మళ్ళా కొంతకాలం అయినతరువాత rationing system వచ్చింది ఇప్పుడు ఈ zonal system ఆంధ్ర, కర్నాటక, మదరాసు, కేరళ, 4 ప్రాంతాలకూ చెందిఉన్నది. zonal system రాకముందు ఉన్న ధరల కంటే, వచ్చిన తరువాత మణుగుకి 1, 2 రు లు ఎక్కువ అయినాయి తరువాత మళ్ళా తగ్గినాయి ఇండియాలోని యితర రాష్ట్రాలలో - రాజస్థాన్, బొంబాయి, బీహార్ మొదలైన రాష్ట్రాలలో ఈ zonal system రాకముందు మణుగు రు 20 ఉండేది ఇప్పుడు 27 రు లు అయినది ఈ zonal system ను మన మంత్రిగారు గాని, మన ప్రభుత్వంవారు గాని ఒప్పలేదని విన్నాము కాని ఇండియా గవర్నమెంటువారి force వల్ల తప్పనిసరిగా చేయవలసి వచ్చింది మన భారత ప్రభుత్వం చేసేది ఏ system అయినా అది సమంజసంగా వుండాలి అన్ని ప్రాంతాలకూ న్యాయంగా ఉండాలి. ఇప్పుడు ఈ నాలుగు రాష్ట్రాలలోనూ ఒకధర ఉన్నది ఇతర రాష్ట్రాలలో మణుగుకు 9 రు లు ఎక్కువ ఉన్నది అంటే ఒకపల్లాకు 21 రు లు ఎక్కువ ఉన్నదన్నమాట కాబట్టి ప్రభుత్వంవారు ఏ పద్ధతినైనా అమలు చేసేటప్పుడు చాలా జాగ్రతగా చేయవలసి యుంటుంది కొద్దిగా తప్పినా మన ఇండియాకు ఎంతో నష్టంవాటిల్లుతుంది కావున యీ zonal system పరిస్థితి మాత్రం బాగాలేదని మనవి చేస్తున్నాను ముందుగా ప్రభుత్వంవారు దీనిని బాగా ఆలోచించాలి ఆహార పరిస్థితి వృద్ధికావడానికి ఉత్పత్తి ఎక్కువ కావాలి వ్యవసాయదారులకు అన్ని విధాలైన ప్రోత్సాహం కావాలి ఇవి అందరూ ఒప్పుకోవలసిన విషయాలే ప్రతిపక్ష సభ్యులు కూడా అదే సెలవిచ్చారు, అందరూ అదే చెబుతున్నారు ఒకవైపున ధరలు తగ్గినప్పుడు ఈ శాసన సభ్యులే పెద్దపెద్ద మీటింగులు పెట్టి, ధరలు తక్కువ ఉన్నాయి, వ్యవసాయదారులకు గిట్టుబాటు ధరలు పెంచాలి అని చెబుతూ ఉంటారు. మళ్ళా, ధరలు హెచ్చినట్లయితే, "బీదప్రజలకు చాలా కష్టంగా ఉన్నది, కాబట్టి ధరలు తగ్గాలని" చెబుతూంటాము.

నిజం ఆలోచిస్తే ధరలు వ్యవసాయదారునికి గిట్టుబాటుగా ఉండాలి. ఇప్పుడు ప్రభుత్వం నిర్ణయించిన ధరలు వ్యవసాయదారునికి చాలా తక్కువయని నేననుకొంటున్నాను. రైతుకు గిట్టుబాటు కాదు. ఆహార పదార్థాలు కాక, ఇతర వ్యాపార పంటలకు హెచ్చుధరలు వస్తాయి, కాని వీటికి తక్కువధరలు

ఉంటాయి ఆంధ్రప్రదేశ్ రైస్‌మిల్ ఓనర్స్ ఎసోసియేషన్‌వారు ప్రభుత్వం పైన దావావేశారు భారతప్రభుత్వంవారి బిల్లుప్రకారం ధర నిర్ణయంచేయాలి, సరకు నిలవచేసినవారి దగ్గరనుంచి స్వాధీనంచేసుకోవాలి 3 నెలల ధర తీసుకొని average చేసి ధర నిర్ణయించాలని పార్లమెంటులో ఒక బిల్లుచేశారు అప్పుడు వారు ఒక ధర నిర్ణయించారు, దానికి విరుద్ధంగా మూడు జిల్లాలలో- కృష్ణా, ప గో జిల్లా, తూ గో జిల్లాలలో తక్కువ ధరలు నిర్ణయించారు ఈ ప్రకారం భారత ప్రభుత్వం యొక్క Food Minister ఏలా ఆలోచిస్తున్నాడో తోచడం లేదు ఇప్పటి ధరల విషయం చూచినట్లయితే ఇదివరకు మన భారతదేశంలో rationing system వచ్చినప్పుడు పల్లా రు 34 నుంచి రు 40 ల వరకూ ధర లున్నాయి 1942-43 వ సం లో పల్లా రు 16 ల ధర ఉండేది. దొడ్డు బియ్యం పల్లా రు 12 లు ఉండేది అంటే మణుగుకు రు 4 లు 12 రు లు పోయి, 20 రు లు అయితే తెలంగాణాలోని ఖమ్మంమెట్టు జిల్లాలో దోపిడీలు కూడా చెలరేగినాయి ఇప్పుడు average rate రు 20 లు ఉన్నది పన్నుల విషయం చూచినట్లయితే ఎక్కువగానేఉన్నాయి కాని యిప్పుడు వ్యవసాయ దారునికి అన్నివిధాలా ఖర్చులుకూడా ఎక్కువఅయినాయి, కాబట్టి యిపుడున్న ధరలు చాలా సమంజసంగానే ఉన్నాయి ఈ ధరలను యింకా తక్కువ చేయడం సమంజసమైన విషయంకాదు 3 పైసలు పన్ను ఎక్కువచేస్తే వ్యాపారస్తులు 10 పైసలు ఎక్కువ తీసుకుంటారని కొంతమంది సభ్యులు చెప్పారు శాసనసభ్యులమైన మనం ఒక్క వ్యవసాయదారుల వైపునుంచి గాని, ఒక్క వర్తకుల వైపునుంచి గాని రాలేదు మొత్తం ప్రజలనుంచి వచ్చి, శాసనసభ్యులమైనాము. మనము ఎప్పుడు మాట్లాడినా సమంజసముగా ఉండాలి 3 పైసలు టాక్సు వసూలుచేస్తే ధర ఎప్పుడూ ఎక్కువకాదు పంటలు పండకపోవటం వల్ల సర్‌ప్లస్ ఏరియానుంచి డెఫిసిట్ ఏరియాకు పంపాలంటే వాగన్స్ సప్లయి కాకపోవడం వల్ల అప్పుడప్పుడూ పెద్ద పెద్ద పట్టణాలలో ధరలు ఎక్కువవుతూ ఉంటాయి. అంతేగాని, ఎప్పుడూ ఎక్కువ ధరలు ఉంటాయని అనుకోవద్దు.

ఇంకొక మనవి ఏమంటే - భారత ప్రభుత్వము ఈ జోనల్‌సిస్టమును త్వరగా తీసివేయాలి అది ఉన్న కారణంచేత, ఇక్కడ నుండి ఎంతో సరకు పర్మిషన్ లేకుండా బయటకు పోతున్నది అది మనకు లాభంలేదు. మనప్రభుత్వం భారతప్రభుత్వమునకు వ్రాసి జోనల్‌సిస్టమ్ తీసివేయించాలని మనవిచేస్తున్నాను

శ్రీ యల్. లక్ష్మణదాసు (పాతపట్నం - జనరల్): అధ్యక్షా! ఈనాడు వ్యవసాయశాఖా మాత్యులు శ్రీ తిమ్మారెడ్డిగారు, రాష్ట్రంలో ఉన్న ఆహార ధాన్యాల విషయం, పంటలవిషయం స్పష్టంగా తెలియజేశారు. శ్రీకాకుళం జిల్లాలో వర్షాలు తక్కువగా ఉన్నవని ప్రభుత్వంవారుకూడ చెప్పారు అక్కడ

ముఖ్యంగా నాలుగు తాలూకాలలో,—పాతపట్నం, టెక్కలి, సోంపేట, ఇచ్ఛాపురం తాలోకాలలో విపరీతనష్టం వచ్చిందని ప్రభుత్వం గుర్తించాలని కోరుతున్నాను ఈ సంవత్సరం, ఆఖరుని వర్షాలుపడ్డాయి రైతు, ఎరువులు వేసి ఉభాలు చేసినతరువాత షుమారు 60 దినాలనుంచి వర్షాలులేక ఊడ్చిన ఉభాలు పూర్తిగా ఎండిపోయినవి ఇది రైతాంగానికి పెద్దదెబ్బ దానికి సరైనవిధంగా ప్రభుత్వం చర్యలు తీసుకొనవలెనని కోరుతున్నాను ఇంతకుముందు నాగిరెడ్డి గారు మాట్లాడుతూ కాంగ్రెసువాదులే, కరువు ఏర్పడినదని చెప్పినారని చెప్పారు. నిజమే కరువు ఉన్నచోట కాంగ్రెసువారు ఆ విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకురావటం వారిధర్మం ఆ విధంగా దాపరికంలేకుండా తెలియ జేస్తున్నారు ప్రభుత్వంకూడ ఎక్కడ కరువు ఉన్నదో, ఎక్కడ వర్షంలేకుండా ఉన్నదో గుర్తించారు

వ్యవసాయం విషయం ఆలోచిస్తే, రైతుకు ఈనాడు వ్యవసాయం గిట్టుబాటు అవుతున్నదో లేదో పరిశీలన చేయాలి ఒకప్రక్క ధరలు పెరుగు తున్నాయని రైతులు విపరీతంగా ఆర్జించుకొంటున్నారని చెబుతున్నారు రెండవప్రక్క రైతు తనకు కావలసిన వ్యవసాయ పరికరాలు కొనుక్కొన వలెనంటే వాటికి ధరలు పెరుగుతున్నాయని అంటున్నారు రైతు ఈనాడు శిస్తులుకూడ కట్టుకోలేకుండా ఉన్నాడని, యింకా అతనికే పన్నులు అధికం చేయుట అన్యాయమని కమ్యూనిస్టు సభ్యులు చెపుతున్నారు ఒక విషయం చాలా సంతోషిస్తున్నాను. శాసన సభ్యులు అంతా రైతుల విషయానికి సుస్పష్టంగా తెలియచేశారు ఇతరులమాదిరి రైతు తన విషయం agitate చేసుకొనలేకుండా ఉన్నాడు ఈనాడు శ్రీకాకుళం జిల్లాలో ఏర్పడిన కరువు పరిస్థితిగురించి తక్కిన విషయాలకన్న బ్రహ్మాండమైన ఆందోళన చేయవలసి యుంటుంది. వర్షములులేక, పొలములు ఎండిపోయి బాధపడుతున్న దుస్థితిలో ఉన్నాడు, ధరలు విపరీతంగా పెరిగాయని అంటున్నారు కాని యదార్థ పరిస్థితులుచూస్తే 1953 లో 100 ఉంటే ఈనాడు 95 ఉన్నది '55 లో 75 కు దిగిపోయింది అదేవిధంగా రైతు కొనే మెటల్ ప్రాడక్ట్సు '53 లో 107 ఉంటే, యివాళ 126, యింకాపైన ఉన్నది టెక్స్టైల్సు 99 నుంచి 106 కు పెరిగినవి. ఈ విధంగా, కొనుక్కునేవస్తువుల ధరలు విపరీతంగా పెరిగి పోయినవి 1955 లో రైతు పండించే పంటలకు ధర తగ్గిపోయిననాడు, రైతు ఎంతదుస్థితి పాలైనాడో ఎవరూ విచారించలేక పోయాము రైతుల పరిస్థితి, వ్యవసాయ పరిస్థితి క్షుణ్ణంగా తెలుసుకొనుటకు ప్రభుత్వం ఒక కమిటీవేసి సంపూర్ణమయిన నివేదికను ప్రజలందరికీ అందజేయా లని ప్రభుత్వానికి ముఖ్యంగా మనవి చేస్తున్నాను వ్యవసాయంలో ఉండే కష్టసుఖాలు, రైతు ఈనాడు పడుతున్న బాధ చూడాలంటే శ్రీకాకుళం

జిల్లాలోని ఆ నాలుగు తాలూకాలలో తిరిగి ఏవిధంగా రైతులు తమ పొలాలు ఎండిపోయి ఆవేదనపడుతున్నారో గుర్తించాలని కోరుతున్నాను రైతు సమస్యలు చాలామందికి అర్థముకావు వ్యవసాయము చేసేవారికే తెలుస్తాయి ప్రతిఒక్కరూ రైతునాయకులుగా, రైతు వీరులుగా, యిక్కడ మాట్లాడ వచ్చును కాని మీద్వారా మంత్రిగారిని, ప్రతిపక్షాలను, అందరి శాసనసభ్యులను ఒకటే ప్రశ్నిస్తున్నాను నేనుచెప్పిన నాలుగు తాలూకాలలోని రైతులు, తమ పంటలు సంపూర్ణంగా నాశనమైనందున తిరిగి ఎన్నిసంవత్సరాలు పంటలు పండితే మంచి పరిస్థితులలోకి వస్తారో ఊహించాలని, లెక్కలువేసి తెలుసుకోవాలని నేను మనవిచేస్తున్నాను వారు పండించేపంటలో వారు తిండితినాలి, కొనుక్కో వలసిన వస్తువులన్నీ కొనుక్కోవాలి, కుటుంబ పరిస్థితులు చక్కదిద్దుకోవాలి, వచ్చేసంవత్సరం మదుపులుగురించి అప్పులు తేవాలి. అందుచేత ఒక్క సంవత్సరం పంటపోతే, తరువాత ఎన్నిసంవత్సరాలు సంపూర్ణంగా పండితే రైతు మామూలు నార్మల్ పరిస్థితిలోకి వస్తాడో ఆలోచించాలి వ్యవసాయ రంగం మీద, రైతుయొక్క అభివృద్ధిమీద, మన plans, మన ప్రభుత్వమేకాదు, భారత దేశం భవిష్యత్తు ఆధారపడి ఉన్నది మనం పండించి యితర దేశాలకు అమ్ము కొని ధనం సంపాదించి మన దేశాన్ని అభివృద్ధి చేసుకోవాలి మిగతా రంగా లలో మనం ధనాన్ని ఆర్జించి దేశాన్ని అభివృద్ధి చేసుకునే అవకాశం ప్రస్తుతం లేకుండా ఉన్నది అందుచేత రైతాంగం యొక్క బాగోగులు ముఖ్యంగా చూడాలి ధరలు విపరీతంగా పెరుగుతున్నా, బీదప్రజలకు తిండి ధాన్యం తక్కువధరకు అందించాలి ప్రభుత్వమే ధాన్యాన్ని రైతులవద్ద గిట్టుబాటు ధరలకు కొని, కరువు ప్రాంతాలలో fair price shops పెట్టి సప్లై చేయాలి ఆ విషయంలో ప్రభుత్వం ఉదారంగా ఉండాలని అందరి ఉద్దేశం

ఈనాడు రైతు పండించేదానికి ఉన్నధర రైతుకుగిట్టుబాటు అవుతున్నదా లేదా, ఈ ధరలతో వ్యవసాయాన్ని అభివృద్ధి చేసుకొని ముందుకు పోగలడా, లేదా, అనే విషయం ప్రతిసభ్యుడూ గమనించాలని కోరుతున్నాను. కాలవలు ఉండి నీరు అందుతున్న ప్రదేశాలలో ఏదోవిధంగా పంట పండుతున్నది, వారు కాలక్షేపం చేస్తారు. కాని కాలవలు లేని మెట్ట ప్రదేశాలలోని పరిస్థితులు గమ నిస్తే అక్కడ రైతాంగం ఏవిధంగా జీవిస్తున్నారో చూడాలి ఈనాడు రమా రమి పదిలక్షల ప్రజానీకం పంటలు సర్వనాశనమై వ్యవసాయంమీద ఆధారపడే కూలీలు, యితరులు, ఏవిధంగా బ్రతుకుతున్నారో గమనించాలి రైతుకు credit facilities కూడ లేవు - మార్కెటింగ్ సొసైటీలు కావాలి కో ఆప రేటివ్ సొసైటీలు, బ్యాంకులు ఎన్నో పెడుతున్నాము పదివేల రూ ల ధనంలో మిల్లు పెట్టుకొన్నవానికి ఆంధ్ర బ్యాంకులో 5 వేల cash credit దొరుకుతుంది. కాని 50 ఎకరాల భూమి ఉన్న రైతుకు కో ఆపరేటివ్ సొసైటీలో maximum

వెయ్యి రూపాయలకంటె ఎక్కువ అప్పు దొరుకదు కాబట్టి credit facilities అభివృద్ధిచేసి రైతాంగాన్ని ముందుకు తీసుకుపోవాలి

నీటివాగుల విషయం మనవి చేస్తాను మాది జమీందారీ ఏరియా నాలుగు తాలూకాలలో సోంపేట తప్ప తక్కిన మూడు తాలూకాలు పూర్తిగా జమీందారీ ఏరియా జమీందారీలను రద్దు చేస్తామని చేసిన agitaion వల్ల, అవి abolition కాకముందే చెరువులను, నీటి వాగులను అభివృద్ధి చేయకుండా విడిచి పెట్టారు.

జమీందారులకు వచ్చే బాకీలను వసూలుచేసి పెట్టాము కాని ఆప్రాంతంలో ఉన్న చెరువులను, నీటి వనరులను బాగుచేయించటానికి శ్రద్ధ తీసుకోలేదు కాబట్టి ప్రభుత్వం వెంటనే నీటివనరులను, చెరువులను బాగుచేయించాలి ప్రభుత్వం తక్షణం కరువు నివారణకు చర్యలు తీసుకోవాలి "జనవరిలో పంటలు చూసుకొందాము, కలెక్టర్ శాంక్షన్ చేయాలి, ఫిబ్రవరిలో ప్లాన్సు వేసుకొందాము, మార్చిలో ప్రారంభిద్దాము" అని ఆలస్యంచేస్తే చాలా ప్రమాదం ఏర్పడుతుంది కాబట్టి ప్రభుత్వము వెంటనే దానికి చర్యలు తీసుకోవాలి నేను ముఖ్యమంత్రిగారిని అభినందిస్తున్నాను ఈ విషయాలు వారికి చెప్పగానే, డిశంబరు మొదటివారంలో మా ప్రాంతంలో పర్యటన చేయటానికి అంగీకరించారు ఈ లోపలే, కరువు కాటకాలు నివారించటానికి, ఆ ప్రాంతాన్ని అభివృద్ధిపరచటానికి తక్షణమే ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని కోరుతూ విరమిస్తున్నాను

*శ్రీ డి. కొండయ్య చౌదరి (కందుకూరు) అధ్యక్షా, ఆహార పరిస్థితిని సమీక్షచేస్తూ ప్రభుత్వంవారు ఇచ్చిన నివేదికను పూర్తిగా ఆమోదించమని నేను సభవారిని కోరుతున్నాను. ఇంతవరకు జరిగిన చర్చను పరిశీలిస్తే ఒక విషయం గోచరిస్తుంది మన రాష్ట్రంలో ఆహారం కొరతగా లేదనే విషయానికి అన్ని పక్షాలవారు ఏకీభవిస్తారు అనుకొంటాను. ఇప్పుడు ఉన్న సమస్య ఆహార కొరత కాదు. ఆహారధాన్యాల ధరలు ఎక్కువ అవుతున్నాయి. ఆహారధాన్యాలు సామాన్య ప్రజలకు అందుబాటులో లేవు అందువల్ల ధరలను అదుపులో పెట్టి, ఆహారధాన్యములు అందరికి అందుబాటులో లభ్యమయ్యేటట్లు చేయవలసి ఉన్నది అన్నది ఒక ముఖ్యమైన విషయంగా కనిపిస్తున్నది

శ్రీ పి. సుందరయ్య : ఆంధ్రదేశంలో ప్రజలకు కావలసిన ఆహారం తయారుకావటంలేదని మా వాదన

శ్రీ డి. కొండయ్య చౌదరి : ఆహారం కొరతవల్లనే పరిస్థితులు కటకటగా ఉన్నవి కాని, ఆహార ధరలవల్ల కాదని ప్రతిపక్షంవారు ఒప్పుకొన్నందుకు సంతోషము.

శ్రీ పి సుందరయ్య అది సభ్యుల భావము

శ్రీ డి కొండయ్య చౌదరి ఇప్పటి పరిస్థితిలో ఆంధ్రదేశంలో ఉన్న ఆహారోత్పత్తి, మన ప్రజలకు చాలి, ఇంకా మిగతా వారికి పంపించే అవకాశము ఉన్నది ఆహారోత్పత్తి కూడా ఇంకా పెంపుదల చేయటానికి అవకాశము ఉన్నది అందుకు తోడ్పడవలసిందిగా మన ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయడం సమంజసంగా ఉంటుందని నా ఉద్దేశము "ఇక్కడ ఆకలి యాత్రలు జరిగాయి, అక్కడ ఆకలియాత్రలు జరిగాయి" అని ప్రతిపక్షంవారు చెప్పటం జరిగింది కర్నూలుజిల్లాలో ఆకలియాత్రలు జరిపితే 2 వేలమంది వచ్చారని నాగిరెడ్డిగారు చెప్పారు 18 లక్షలు జనాభాగల కర్నూలుజిల్లాలో ఆకలియాత్రలు జరపటానికి 2 వేలమంది వచ్చారట దీనినిబట్టి ఎటువంటి ఆకలి యాత్రలు జరుపుతున్నది మనకు తెలుస్తుంది 18 లక్షల జనాభాలో 2 వేల మంది మాత్రమే ఆకలియాత్రలో పాల్గొన్నారంటే, యీ ఆకలియాత్రల ఫలితం ఏ రకంగా ఉంటుందో అర్థం చేసుకోవచ్చును ఆకలి లేకపోలేదు. కాని నీటిఆవిరి మాదిరిగా ఒకరోజున యీ ఆకలియాత్ర బయలుదేరుతుంది తరువాత దానినిగురించి అనుకొనేవారే ఉండరు వెనుక ఎవరోఉండి, వారి ప్రోత్సాహం చేత ఆకలియాత్రలు జరుగుతున్నాయన్నది మనం ఆలోచించవలసిన విషయం. నిజంగా ఆకలియాత్రల పరిస్థితే ఏర్పడిఉంటే, అవి కంటిన్యుయస్‌గా జరుగుతూ ఉండేవి కాని అట్లా జరగటంలేదు ఒకరోజు ప్రమాదవశాత్తు రెండువేలమంది సమీకరించబడటం, వారిని జిల్లాకలెక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళటం, వారు ఆకలి వల్ల చస్తున్నామని చెప్పటంతప్ప నిజంగా ఆకలియాత్రలు సాగించేపరిస్థితి ప్రస్తుతం లేదు ఆరోజుతప్ప, మరునాడు యీ ఆకలియాత్రలు గురించే అనుకోక పోవటం జరుగుతున్నది కాబట్టి యీ ఆకలియాత్రలు "ఆర్టిఫిషియల్లీ ఇంజనీర్డ్" గా కనుపిస్తున్నవి కాని, నిజంగా స్వాభావికంగా వచ్చిన ఆందోళనగా కనిపించటంలేదు ఆహారధాన్యాల ధరలు మిన్నుముట్టుతున్నాయని చెబుతున్నారు ప్రభుత్వం ఇచ్చిన లెక్కలప్రకారం ధరవరలు చూస్తే, 1953 వ సం॥ లో ఉన్న ధరలకు, యీనాడు ఉన్న ధరలకు తేడా తక్కువగా ఉన్నది కాని ఎక్కువగాలేదని చెబుతున్నాను సరఫరా కాకుండా రైతులు ఆహార ధాన్యమంతా తమదగ్గర బిగపెట్టుకొంటున్నారని అంటున్నారు. "గొప్ప గొప్ప రైతులు చిన్నరైతుల దగ్గర ధాన్యంకొని నిలవచేసి, ధరలు పెరిగినపుడు అమ్ముకొని లాభాలు సంపాదించటానికి చూస్తున్నారు" అని ఒక ప్రముఖ ఆంధ్ర నాయకులు అన్నారు అందువల్లనే ధరలు ఎక్కువవుతున్నాయని చెబుతున్నారు పత్రికలలో వ్రాసుకొంటే వ్రాసుకోవచ్చుగాని, ఇటువంటి ఆధారరహితమైన మాటలు చెప్పటంవల్ల ప్రయోజనంలేదు. అది పూర్తిగా వాస్తవానికి దూరమైన

విషయము నెల్లూరు జిల్లాలో ఏ రైతు వ్యాపారంచేయటం లేదు చిన్నచిన్న రైతుల దగ్గర ధాన్యం కొనుగోలుచేసి, ఒక పాతరలో పోసి, ఎప్పుడో ధరలు పెరిగినపుడు అమ్ముకొని లాభాలు సంపాదించుకొందామని అనుకొనే పెద్ద రైతులు నెల్లూరు జిల్లాలో లేరు రైతుల మధ్య విభేదాలు పెట్టడం కోసం యీ విధంగా చెప్పటం జరుగుతోంది రైతులను సంఘటితపర్చకుండా వారిలో విభేదాలు కలిగించేమాటలు తప్పితే, ఆమాటలలో అర్థంలేదని మనవిచేస్తున్నాను

గ్రామీణ ప్రజల గురించి ఒక విషయం చెప్పదలచుకొన్నాను సాధారణంగా గ్రామాలలో ఉన్న పరిస్థితి ఏమిటి ? గ్రామాలలో ఉండేది రైతులు, వ్యవసాయ కూలీలు ప్రతిచోట రైతులు వ్యవసాయకూలీలకు గింజలు ఇచ్చి, కూలీపని చేయించుకొంటారు వ్యవసాయ కూలీలకు kind లో pay చేయటము ఉన్నది కాని డబ్బురూపేణా ఇవ్వటము ఎక్కడా లేదు కాబట్టి ఆహారధాన్యాల ధరలు ఎలాఉన్నా గ్రామాలలోఉన్న వ్యవసాయ కూలీలకు, రైతులకు ఇబ్బంది లేదు ఆహారధాన్యాల ధరలు మిన్ను అంటుతున్నా వారికి ఇబ్బందిలేదు కాబట్టి పట్టణాలలో ఉండే ప్రజల దగ్గరనుంచి మాత్రమే ధరలు పెరుగుతున్నాయనే విమర్శ వస్తున్నది వారికి ఆర్గనైజ్డు ఎసోసియేషన్సు ఉన్నాయి కాబట్టి, వారు అరవగలరు కాబట్టి, పత్రికలలో ప్రకటనలు చేయగలరు కాబట్టి, కాస్త ధరలు ఎక్కువైనప్పుడల్లా "కరువు వచ్చేటట్లుగా ఉన్నది ; ప్రభుత్వంవారు వెంటనే చర్యలు తీసుకోవలసి ఉంటుంది" అని పట్టణవాసులు చెప్పటం జరుగుతున్నది అంతేగాని గ్రామాల్లో ఉండే రైతులు గాని, వ్యవసాయకూలీలు కాని ఆందోళన చెందటంలేదు. ధాన్యం రూపేణా కూలి ఇవ్వబడుతోంది కాబట్టి ధరలు ఎక్కువైనందుకు వారు ఆందోళనపడటంలేదు కాబట్టి ధరలు పెరిగాయనేది అనవసరమైనఆందోళన తప్పితే, న్యాయమైన ఆందోళనకాదని మనవిచేస్తున్నాను రైతు ఉత్పత్తిదారుడే కాదు, రైతు ఆహారధాన్యాలు ఉత్పత్తిచేసేవాడేకాదు రైతు కూడా కొన్ని వస్తువులు కొనుక్కొనేవాడని గ్రహించాలి రైతు కేవలం ఆహారధాన్యాలు తిని బ్రతికేవాడుకాదు ఇవాళ ఎక్కువ ధరలు ఉండటంవల్ల రైతులు చాలా బాగుపడుతున్నారని అనుకోవటం పొరపాటు ఇవాళ ఆంధ్ర రాష్ట్రంలో పదకొండుకోట్ల రూపాయలు లాండ్ రెవిన్యూ వసూలుకావలసి ఉన్నది. ఈ డబ్బును కట్టలేని పరిస్థితిలో యీనాడు రైతులు ఉన్నారు ఆహారధాన్యాల ధరల వలన, వారిదగ్గర ఎక్కువ డబ్బు ఉంటే, యీ డబ్బు ఎందుకు కట్టలేకపోతున్నారు ? రైతులు ఉత్పత్తిచేసే ధాన్యం ధర ఎక్కువ ఉన్నప్పటికీ, వారు కొనుక్కొనే వస్తువుల ధరలు కూడ విపరీతంగా పెరగటంవల్ల, బేలన్సు చేసుకోలేని పరిస్థితిలోఉండి, చివరకు గవర్నమెంటుకు టాక్సుకూడ చెల్లించలేని స్థితిలో ఉన్నారు

ఉదాహరణకు ఒక విషయం చెబుతాను చేనేత పారిశ్రామికులు కూడ కష్టాలు పడుతున్న మాట వాస్తవమే వారికి ధాన్యం చౌకగా సప్లయి చేయవలసిన అవసరము ఉన్నది, నిజమే కాని వారు ఉత్పత్తిచేసేవస్తువులు రైతులు కొనాలికదా చేనేత పారిశ్రామికులు కూడ తాము తయారుచేసే వస్తువులు సరసమైన ధరలకు ఏల విక్రయించరాదుఅని అడుగుతున్నాను వారికి గిట్టుబాటు అయ్యే కూలీలు హెచ్చుస్థాయిలో ఉండాలి పూర్వం రూపాయిన్నరకు అమ్ముతూండే అరవై నెంబరు చీర యీనాడు వారు పది రూపాయలన్నరకు అమ్ముతూండవచ్చు కాని రైతుమాత్రం తాను పండించే ధాన్యం 80 రూపాయలకు, 120 రూ లకు అమ్మవలెననే నిర్బంధం పెట్టటం ఏమి న్యాయమని అడుగుతున్నాను

శ్రీ ప్రగడ కోటయ్య మన కొండయ్యాచౌదరి గారికి చేనేత పరిశ్రమకు సంబంధించిన విషయంలో అనుభవంలేక వారు చేనేతపారిశ్రామికుడు సరాసరి ఏదో ప్రమింగుతున్నాడని అనుకొంటున్నారు వారికి కావలసిన నూలు ఇచ్చే మిల్లు యజమానులను కంట్రోలు చేయనటువంటి పరిస్థితిలో ప్రభుత్వం ఉన్నందువల్ల అటు రైతులకు, ఇటు చేనేత పారిశ్రామికులకు అన్యాయం జరుగుతున్నదన్న విషయం కొండయ్యాచౌదరిగారు గ్రహించాలి

శ్రీ డి. కొండయ్య చౌదరి ఇక చేనేతవారు నూలుకు ధర పెరిగింది, దానివల్ల నేసినబట్టలను సరసమైన ధరకు సప్లయి చేయలేకపోతున్నామని అంటున్నారు దీనినిగురించికాదు ఇప్పుడు ప్రశ్న దీనిని గురించి ఆ మిల్లు యజమానులమీద వత్తిడి చేయాలి మిల్లు యజమానులు కార్మికులకు ఎక్కువగా జీతాలు యివ్వలేమని చెప్పినప్పుడు, కార్మికులకు సరసమైన జీతాలు యిచ్చేటట్లుగా చేయాలి. ప్రగడ కోటయ్యగారు చెప్పారు అయితే యజమానులు కూలీలకు యిచ్చే జీతములు ఎక్కువ అయిపోయినవి, అక్కడ "ఉత్పత్తికి, **Sales Tax** వగైరాలు ఎక్కువగ ఖర్చుచేయవలసి వస్తున్నది అందువల్ల మేము సరసమైన ధరలకు నూలు సప్లయి చేయలేమని" అంటున్నారు కాబట్టి మనమందరము కలసి నూలును సక్రమమైన ధరలకు సప్లయి చేసేటట్లుగా చూచుకోవలసిందే గాని, రైతులు ఉత్పత్తిచేసే ధాన్యానికి ధర తగ్గించాలని ఆందోళన చేయడము ఏ మాత్రము న్యాయము కాదని మనవి చేస్తున్నాను.

ప్రభుత్వమువారు సమర్పించిన నివేదిక తరువాత, అన్నింటికంటె ఒక్క విషయములో మాత్రము నేను వ్యవసాయశాఖ మంత్రిగారికి నా కృతజ్ఞత తెలుపుకోవలసి ఉన్నది. అయన పద్మవ్యూహములో అభిమన్యుడు కౌరవుల చేతులలో చిక్కుకుని పోయినట్లు యీ ధాన్యపుధర పెరుగుదల విషయంలో

వచ్చిన విమర్శలలో చిక్కుకుని పోయారు కాని ఆయన ఆ వచ్చిన విమర్శల కన్నింటికి తట్టుకుంటూ, ఇటు యీ organised people గా యుండేవారి యొక్క విమర్శలకు తట్టుకుంటూ, అటు కేంద్రప్రభుత్వమునుంచివచ్చే తాకిడికి తట్టుకుంటూకూడ ఆహారాన్ని ఎక్కువగ ఉత్పత్తిచేసే వర్గమును support చేస్తూన్నందులకు ఆ ఉత్పత్తిదార్లందరి తరఫున అభినందిస్తూ, యీ విషయములో మంత్రిగారుచేసే యుద్ధానికి నేను మాత్రము వారికి చాలా కృతజ్ఞుడుగా ఉంటున్నానని మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను

శ్రీ ప్రగడ కోటయ్య (పేరాల) అధ్యక్షా, On a point of information, Sir ఇప్పుడు గౌరవసభ్యులు చాలామంది మాట్లాడిన సందర్భములలో వారు చేనేతపరిశ్రమనుగురించి ఉదహరిస్తూ, రైతులకు నేను ఏదో చాలా అపకారము చేస్తున్నట్లుగా చాలా ప్రసంగాలు బయలుపెడలినవి, ఆ విషయములో నేను కనీసము నా యొక్క అభిప్రాయమును చెప్పుకోటానికైనా నాకు యీ రోజున అవకాశము యివ్వకపోతే ఎట్లాగో మీరు చెప్పండి ఇప్పుడు ఇంతమంది రైతు వర్గానికిచెందిన సభ్యులకు మీరు అవకాశము యిచ్చారు అదేమాదిరి యీ సమయములో యిక్కడ నా మాటకూడ చెప్పుకోటానికి మీరు కొంచెము అవకాశమైనను యివ్వకపోతే ఇది చాలా అన్యాయము అని అంటున్నాను ఎందుకంటే యీనాడు శాసనసభలో యావత్తు విషయాలుకూడ రైతులకు సంబంధించినవారు, ప్రతినిధులు, అందులోవారు ముఖ్యమైనవారు అన్నీ వారిపరంగానే జరిగిపోతున్నాయి బలహీనులైనవారు, వారి వాదాన్ని యీ సభలో చెప్పుకోటానికి అవకాశము అధ్యక్షులవారు యివ్వకపోవుటమ్ముచేత, యింతటితో as a protest, I am walking out

శ్రీ వి. కూర్మయ్య (గుడివాడ-రిజర్వుడు) : అధ్యక్షా, ఈనాటి చర్చలో ముఖ్యంగా రైతులగురించి సభ్యులు మాట్లాడారు కాని వ్యవసాయ కూలీలను గురించికూడ చాలా సలహాలు, references వచ్చినవి అటువంటప్పుడు, చేనేత వారికి, వ్యవసాయ కూలీలకు సంబంధించిన food situation గురించి మాట్లాడవలసియున్నది. వాళ్ళవిషయముకూడా యిక్కడ యీ సమయములో discuss చేయకపోతే, యీనాటి చర్చ ఒకవర్గానికి చెందినది మాత్రమే అవుతుంది. ఎవరయితే ఉత్పత్తికి ఆధార భూతులో, ఎవరయితే ఉత్పత్తి చేస్తారో వారి తరఫునకూడ మాట్లాడటానికి నాకుగూడ అవకాశము యివ్వమని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ . లేదండి

శ్రీ వి. కూర్మయ్య అలాగైతే నేను కూడ protest గా బైటికి వెళ్ళిపోతున్నాను.

శ్రీ యన్ కె లింగం (నందికొట్కూరు - రిజర్వుడు) అధ్యక్షా, ఇప్పటికి పదిరోజులుగా సభలో నేను మాట్లాడే అవకాశముకొరకు నాపేరు మీకు అందజేసియున్నాను కాని నాకు యింతవరకు chance యివ్వలేదు ఆహార సమస్యను గురించి నేనుకూడ మాట్లాడవలసియున్నది నా నియోజకవర్గంలో వ్యవసాయకూలీలు, పేదవాళ్ళు అనేకమంది వచ్చియున్నారు గనుక వాళ్ళ తరపున తప్పకుండా మాట్లాడవలసినవిషయములున్నవి ఇప్పటికి పదిరోజులుగా నాకు chance వస్తుందని కాచుకొని ఉన్నాను. కాని యింతవరకు యివ్వలేదు, గనుక యిప్పటికయినా యిస్తారా, లేదా, అని మిమ్ములను ప్రార్థిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ అట్లా అడగకూడదు అట్లా అడిగేటట్లయితే నేను chance ఎవ్వరికీ యివ్వను అందువల్ల ఒకటే రూలింగు యిస్తున్నాను "మాకు యిస్తారా, లేదా అని అడగకూడదు" నాకు యిక్కడ ఒక class కు గాని, ఒక caste కు గాని ఏలాంటి సంబంధము లేదు ఇక్కడ ఏదో కాంగ్రెసువారు, కమ్యూనిస్టులు వగైరా పార్టీల వారు ఉన్నారు ఇప్పుడు సుందరయ్యగారు మాట్లాడతారు వారు Opposition అందరి తరపున చెబుతారు రామబ్రహ్మం గారుకూడ ఇంకొక మోస్తరుగా మాట్లాడారు కాబట్టి "నాకు chance యిస్తారా, యివ్వరా, లేకపోతే బయటికి పోతాను" అనే యిలాంటి బెదిరింపులతో నేనుకూడ కలిసిపోతాను అని అంటే, **I am not going to change my opinions or procedure even if any Member threatens to walk out Therefore that is not proper If any Member walks out, I have no objection, I don't bother**

ఒక గౌ॥ సభ్యుడు అధ్యక్షా, సభలోనుంచి లేచిపోవడం కాదండి కాని యీనాడు ఆహారసమస్యను గురించిన చర్చ జరుగుతున్నది ఇది చాలా ముఖ్యమైనది. అందరికీ సంబంధించిన సమస్యగనుక యింకను సభలో మాట్లాడవలసిన వారు చాలామంది ఉన్నారు గనుక, యింకొక అరగంటో, గంటో దీనికి allot చేసి, మాట్లాడవలసిన వారి కందరకు కొద్ది టైము అయినాసరే యివ్వమని మా కోరిక.

మిస్టర్ స్పీకర్ : అలాగైతే నావద్దవున్న లిస్టులో ఇప్పుడు యింకా 25 మంది సభ్యులు మాట్లాడవలసినవారు ఉన్నారు ఇక టైము ఏమీ లేదుగనుక, యిప్పుడు నేనేమి చేయలేను Business Advisory Committee వారి నిర్ణయం ప్రకారము యీనాడు ఒంటిగంటకు యీ చర్చను ముగించవలసి యున్నది గనుక చేయవలసిందే. ఇది జరగవలసిందే. ఇప్పుడు సుందరయ్యగారికి 25 నిమిషాలు, మంత్రిగారికి 30 నిమిషాలు యిస్తున్నాను దానితో చర్చ close అవు

తుంది కనుక యీ విషయము సభవారి కందరికి సవినయముగ మనవి చేస్తు న్నాను.

శ్రీ బసవ మానయ్య అధ్యక్షా, మేము సమయములోపలనే మీకు మా పేర్లను అందజేశాము ఇప్పుడు టైము అయిపోయింది అనే బదులు, ఒక్కొక్కరికి పది నిమిషాలు యిచ్చేబదులు, ఉన్న టైము చాలకపోతే, కనీసము ఒక్కొక్కరికి మూడేసి నిమిషాలైనా chance యివ్వమని కోరుతున్నాను సభలో మాకు ఉండే హక్కు శ్రీ వారు కొంచెము ఆలోచించి, కనీసము రెండు మూడు నిమిషాలైనా అవకాశము యిస్తే బాగా ఉంటుందని, ఇవ్వమని ప్రార్థిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ ఈ సభలో 300 మంది సభ్యులు ఉన్నారు ఇక్కొక్కరికి రెండేసి నిమిషాలు అని లెక్కవేస్తే, 300 మందికి చేరి ఆరువందల నిమిషాలు యివ్వవలసి ఉంటుంది. మనకు అంత టైము లేదు సభ్యుల హక్కులు అంటూ యీ విషయములో ఏమీ లేదు వచ్చినవారికి chance వచ్చింది ఇచ్చాము. మాట్లాడారు. ఇంకొక subject మీద కొందరు మాట్లాడారు. అందులో బసవ మానయ్యగారుకూడ చాలాసార్లు మాట్లాడారు అందరికి chance కావాలంటే, ఇక ప్రతిరోజు ప్రతి సభ్యుడు ప్రతి subject ను గురించి మాట్లాడాలంటే, అది ఎట్లా వీలు అవుతుంది ? కాబట్టి నాకు వీలు అయినంతవరకు కొత్త సభ్యులకు గూడ chance యిచ్చాము ఇక ముందు చూస్తాము శ్రీ యన్ కె లింగం గారికి chance కావాలంటే, రేపు చూద్దాం. రేపు యింకా రెండు బిల్లులు ఉన్నవి కదా ! అప్పుడు మాట్లాడవచ్చును.

శ్రీ యన్. కె. లింగం : On a point of information, Sir, పల్లెలలో జొన్నలు రూపాయికి పది అమ్ముతున్నారని యిప్పుడు అందరు చెబుతున్నారు. ఇంత ఖరీదుమీద వాళ్ళకు తిండికి చాలక చాలా యిబ్బందిపడుతున్నారు తిండికి లేనందున ఇళ్ళలో జొరబడి దోపిడీలు చేస్తున్నారు అది జరగకుండా కలెక్టరుగారు పోలీసు సిబ్బందిని పంపుతున్నారు. అలాంటి పరిస్థితులున్నప్పుడు వాళ్ళతరఫున చెప్పేవాళ్ళు ఒకరైనా లేరుగదా ధరలు రోజురోజుకు పెరిగి పోతున్నవి. కాని, అందరు సభ్యులు తగ్గిపోయినవి, తగ్గిపోయివవని చెప్పారు. అది నిజము కాదు. కాబట్టి నా ఉపన్యాసముకూడ మీరు వినాలని ప్రార్థిస్తు న్నాను. వారందరు వేరే పార్టీవారు. అలాంటప్పుడు మా మాటలుకూడ వినాలిగదా స్వామీ !

మిస్టర్ స్పీకర్ : నేను ఎవరినీకూడ యికముందు మాట్లాడనివ్వ దలచుకోలేదు, నాకు పార్టీతో సంబంధము లేదు. ఎవరు ఏ అభిప్రాయాలు

చెప్పినా, వాటితో నాకు సంబంధము లేదు అందరికీ fair గా chance యిచ్చాను ఇప్పటికే టైము అయిపోయింది నేను time ప్రకారము, Business Advisory Committee నిర్ణయించిన ప్రకారము కార్యక్రమము నడిపించవలసి యున్నది ఇప్పుడు సుందరయ్యగారు మాట్లాడుతారు That is all

శ్రీ జి వెంకటస్వామి (సిరుపూరు - రిజర్వుడు) అధ్యక్షా, మేము labour కు ప్రతినిధులము గనుక, మాకు chance యివ్వవలెను కార్మికులకు rations చాలక చాలా యిబ్బంది పడుతున్నారు అందువల్ల ఒక్క representative కు అయినా చెప్పుకోటానికి chance యివ్వమని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ ఇంకా చాలా రోజులు ఉన్నవి అప్పుడు మాట్లాడవచ్చు

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, ఈనాడు ఆహారసమస్యను గురించి చాలామంది సభ్యులు మాట్లాడారు రైతులు అనే పేరుతో, వ్యవసాయకూలీల తరపున, భూస్వాములకొరకు మాట్లాడినవారు కూడ ఉన్నారు అదేవిధముగ చిన్న చిన్న రైతులతరపున కూడ మాట్లాడినవారున్నారు కాని మా పార్టీలో వారు కె నరసయ్య మాట్లాడారు వారు వ్యవసాయ కూలికుటుంబమునకు చెందినవారు అందువల్ల వ్యవసాయకుటుంబములు, వారియొక్క కష్టాలను గురించి మాట్లాడారు అందువల్ల శాసనసభలో చర్చ జరిగేటప్పుడు వివిధ పార్టీలవారికి అవకాశమునుబట్టి Speaker గారు chance యివ్వాలన్నప్పుడు, కాంగ్రెసుపార్టీ తరపున అందరురైతులను, భూస్వాములను యిద్దరినీకూడ వారి కాంగ్రెసుపార్టీలో చేర్చుకోవాలిగాని, యిక్కడ మాకు chance యివ్వ లేదు, యివ్వలేదు అని చెప్పడము ఏ విధముగ ఉపయోగకరమో తెలియదు. ఎందుకంటే కాంగ్రెసులో హరిజనులు వ్యవసాయకూలీల తరపున మాట్లాడు తానని ముందుకువస్తే, అప్పుడు మేము యిక్కడఉండి ప్రయోజనములేదు. వ్యవసాయకూలీల తరపున వచ్చినవారు ఒకరు మాట్లాడారు ఇప్పుడు ఆ పార్టీ తరపున నలుగురిపేర్లు యిచ్చి అందరు వ్యవసాయకూలీల తరపున మాట్లాడితే, వాస్తవముగ చాలా బాగాఉండేది మంత్రిగారు యిచ్చిన స్టేటుమెంటునుబట్టి వారు మన రాష్ట్రంలోని ఆహారసమస్యను వారు గుర్తించలేదని బోధపడు తున్నది ఏదో కొన్ని కొన్ని ప్రాంతాలలో కొన్నిపంటలు నష్టపడిపోయినవి. అయినప్పటికినీ అయిదులక్షల టన్నుల ఆహారధాన్యాలు అదనంగా ఉండేవి. ఇప్పుడు ఆ అయిదులక్షల టన్నుల ధాన్యములేకుండా పోతుంది, గనుక ఆహార పరిస్థితి మాత్రము అంత గడ్డుగాదు, అనే రీతిగా ప్రభుత్వముతరపున మంత్రిగారు చెబుతున్నారు. అసలు ఉన్నటువంటి సంక్షోభాన్ని, ఆహార సంక్షోభము యొక్క తీవ్రపరిస్థితిని గురించి మంత్రిగారు చాలా తప్పుఅంచనా వేసి మాట్లాడారని నేను చెప్పకతప్పదు.

ఆంధ్రరాష్ట్రంలో 5 లక్షల టన్నుల బియ్యం ఏరీతిగా మిగులుతుందో మంత్రిగారు లెక్కలిచ్చారు 54 లక్షల టన్నులు జొన్నలుగాని, యితర ఆహార ధాన్యాలు గాని పండుతవనీ, తలకు 14 ounces ఆహారధాన్యాల చొప్పున 49 లక్షల టన్నులు పండితే సరిపోతుందనీ అందుచేత మనకు పండిన 54 లక్షల టన్నులలో 5 లక్షల టన్నులు అదనంగా వుందని లెక్కచెప్పారు కాని మంత్రిగారికి నేను మరొక విషయం జ్ఞాపకం చేయదలచుకున్నాను Nutrition Commission వారు చెప్పిన 14 ounces అనే దానితోపాటు 3 ounces పప్పు ధాన్యాలు, 2 ounces నూనె, 2 ounces చక్కెర, 8 ounces మాంసము, కోడిగ్రుడ్లు, చేపలు, 10 ounces పాలు—పాలుకూడా ఆహారధాన్యాలక్రింద మార్చినప్పుడు, కనీసం 3, 4 ounces మాంసాహారం క్రింద చూసుకున్నప్పుడు —మొత్తం 2,600 calories—మామూలు తక్కువపని చేసినట్టి వ్యక్తులకే 32 ounces ఆహారం కావాలని చెప్పారు ఇంకా బాగా కష్టపడి పనిచేసేవారికి ఎక్కువకావాలి, జబ్బుగావుండేవారికి తక్కువయితే కావచ్చు, అయినప్పుడు 14 ounces చొప్పున లెక్కవేసి ఆంధ్రదేశం చాలా అధికపంటలు పండిస్తున్నది మనప్రజలకు కావలసిన తిండి సరిపోతుందని చెప్పడం పొరపాటుధోరణిలో జరుగుతుందికాని వాస్తవిక పరిస్థితులదృష్ట్యా కానేకాదు పోనీ యిప్పుడున్నటువంటి చేపలు, కోడిగ్రుడ్లు, వేరుశనగ, నూనెగింజలు, చక్కెర లెక్కవేసుకున్నప్పటికీ తలకు 8 ounces కన్న ఎక్కువలేవు 24 ఔన్సులు కావలసి ఉంటుంది 24 ounces చొప్పునకూడ మిగిలేదిలేనప్పుడు యీ ఆహారధాన్యాలు అంటే వరిగాని, జొన్నలుగాని, గోధుమలుగాని, పప్పుధాన్యాలుగాని తిని బ్రతకాల్సి వస్తుంది. అందుచేత 14 ounces లెక్కవేస్తే యేమీ ఉపయోగంలేదు అది 24 ounces అని లెక్కవేయాలి ఆ రకంగా లెక్కవేస్తే మంత్రిగారు చెప్పిన 49 లక్షల టన్నులు సరిపోదు 75 లక్షల టన్నులు లేక 77 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు మన ప్రజలకు కావలసివుంటుది అందుచేత, పండేది 50 లక్షల టన్నుల కంటె ఎక్కువ లేకపోయినప్పుడు ఆంధ్రదేశములో 25 లక్షల టన్నుల ఆహారధాన్యాల కొరత ఏర్పడిందనీ, మన ప్రజలు కడుపునిండా తిండితినాలంటే 25 లక్షల టన్నుల ఆహారధాన్యాల కొరత వుందనే సంగతి మంత్రిగారు గుర్తుపెట్టుకుని తరువాత యేమిచేయాలనేది ఆలోచించాలి. అయితే గత మూడునాలుగేళ్లుగా ఏరకంగా 5 లక్షల టన్నుల బియ్యాన్ని ఎగుమతి చేస్తున్నాం? గత పది సంవత్సరాలుగా ఎగుమతి చేస్తూండవచ్చు, ఏరీతిగా ఎగుమతి చేస్తున్నాంఅంటే, యీ సంవత్సరం వర్షాలు తక్కువయినా బాగా పంటలుపండిన డెల్టాలలో గోదావరి, కృష్ణ, పెన్ననదుల నీటిపై ఆధారపడే ప్రాంతాలలోని గ్రామాలకు వెళ్ళి చూసినట్లయితే వ్యవసాయ కూలీ ప్రజానీకం, ఎకరం లోపునున్న పేద రైతాంగం, గ్రామాలలో దాదాపు

సగం వున్నారు చేతి వృత్తులవారు, చేనేత పరిశ్రమ వారు, యాదవులు, యితర కులస్థులు, పూర్తిగా భూమి లేనటువంటి పేద ప్రజానీకం గ్రామములో 50% వున్నారు ఆంధ్రప్రదేశ్‌లో 1,20,00,000 వరకూ వున్నారు బాగా పంటలుపండే డెల్టాప్రాంతంలోనివారుకూడా సంవత్సరానికి 90 రోజులు ఒకపూటమాత్రం ఏదోరకంగా గంజి త్రాగుతారు. శ్రీ కొండయ్య చౌదరిగారు తల వూపుతున్నారు గ్రామాల అనుభవం వున్నది వారికే కాదు వారికంటె ఎక్కువ అనుభవం నాకుందని చెప్పగలను ఈ వ్యవసాయ కూలీ ప్రజానీకం సంవత్సరానికి 90 రోజులు ఒకపూట తిండి తింటున్నారు అనేసంగతి మరచిపోకూడదు అందుచేత మన ప్రజలు ఒకపూట తిండికి కూడా కొరగాక కటకటలాడుతూంటే, పండిన ధాన్యంలో యిక్కడున్న ప్రజలకు తిండి పెట్టలేక, యిక్కడున్నవారికి కావలసిన పని చూపించలేక, చూపించినా ధాన్యమును కొనుక్కునేరీతిగా కూలీ యివ్వలేక, బాగా భూములున్నటువంటి వాళ్ళదగ్గర పండిన పంటను ఎక్కువ లాభాలకొరకు యితర రాష్ట్రాలకు అమ్ముకోవడం, యితర రకాలుగా అమ్ముకోడానికి అవకాశం వుండబట్టే యీరోజు మన ప్రజలకు తిండిలేని పరిస్థితులు ఏర్పడ్డాయి ఆరీతిగా ఎగుమతి జరుగుతోంది గాని మన ప్రజలకు చాలినంత తిండిపెట్టి అంతా సుఖముగా వుండి, మనం యితర రాష్ట్రాలకు ఎగుమతి చేసుకునే పరిస్థితిలో ఉన్నాం అనేమాట కల్ల అని నేను విన్నవించాల్సి వుంటుంది ధరలు 1953 వ సంవత్సరంలో వుండే ధరలకన్న పెరగలేదు ఏదో కొద్దిగా తప్పితే ఎక్కువ పెరగలేదని మంత్రిగారు అంటున్నారు దానికి ఏదో index లెక్కలు యిచ్చారు నేను index లెక్కలలోకి యిప్పుడు పోదలచుకోలేదు Index లెక్కలు ఏరకంగా తయారుచేస్తున్నారనే సమస్యనుగురించి మంత్రిగారు వేరే ఒక Committee ని వేస్తే index లోపాలు చూస్తాం నేను కోరేది ఒకటే మునుపటికంటే ఎక్కువగా వుందా అనేసంగతి పెట్టకండి ఈరోజు తెలంగాణాప్రాంతం ఖమ్మం జిల్లా నుంచి వచ్చిన వ్యక్తులు ప్రశ్నోత్తరముల సందర్భంలో చెప్పారు ఇదివరకు రూపాయికి అయిదు సేర్లిచ్చే పచ్చజొన్నలు యిప్పుడు రెండుసేర్లు, రెండున్నర సేర్లకంటే ఎక్కువ అమ్మడం లేదంటే ధరలు పెరిగినట్లా, లేనట్లా? Index లెక్కలలోనికి పోదలచుకోలేదు డెల్టా ప్రాంతాలలోని గ్రామసీమలలో వ్యవసాయ కూలీలకు బియ్యం రూపాయకు 1¾ సేర్లకంటె ఎక్కువ దొరకడంలేదనే సంగతి ప్రత్యక్షంగా బోధపడుతున్నది. ఇంకా ధరలు ఎక్కువ పెరగలేదని చెబితే ఉపయోగం యేమిటి? అందుచేత ధరలు పెరిగాయి ఈ ధరలు పెరగడం కూడా ఎవరికి లాభం? కూలీలకు తిండి వుండాలని ఒక ప్రక్క వాదిస్తూ, రైతు దివాలాతీయాలని రైతుకు గిట్టుబాటు కాకపోయినా పేద ప్రజానీకం వెళ్ళి దోచుకోమని చెప్పడంలేదు. కాని నిజముగా ధరలు పెరగడం

వల్ల రైతుకు లాభంవుందా? 1957 వ సంవత్సరం జనవరిలో, మాసూళ్ళలో బస్తా ధాన్యం 20 రూపాయలకంటె ఎక్కువ అమ్మలేదా? బసంగులు, వంక సన్నాలు, ఢిల్లీభోగాల సంగతి చెప్పడంలేదు రెండో రకం ధాన్యం బస్తా 20 రూపాయలకంటె ఎక్కువ అమ్మడంలేదు అంటే మణుగు బియ్యం 15 రూపాయలకంటె ఎక్కువ అమ్మడంలేదు కాని జూలై నెల వచ్చేటప్పటికి బస్తా ధాన్యం 27 రూపాయలకు అమ్ముతుంది. చిన్నరైతాంగం, మధ్యతరగతి రైతాంగం, పన్ను కట్టుకోవలసివచ్చో అప్పులు చెల్లించడానికో, మాసూళ్ళలో, కళ్ళంలోనే అమ్ముకోవలసివచ్చి, 20 రూపాయలకే అమ్ముకోవడం యేమిటి? దానిని కొన్న వర్తకులు గాని, సాహుకార్లు గాని, భూస్వాములు గాని, మిల్లు యజమానులు గాని, Reserve Bank ఇచ్చిన అప్పులద్వారా గాని Scheduled Banks యిచ్చిన అప్పులద్వారా గాని, తమకున్న పరపతిని ఉపయోగించుకుని గానీ, నిలవేసి బస్తా 28 రూపాయలకు అమ్మడం రైతుకు ఏ రీతిగా లాభం? భూమి వున్నవాళ్ళంతా రైతులని మేము ఒప్పుకోము నాగలి తీసుకుని భూమి దున్ని స్వయముగా కొడవలితో పనిచేసేటటువంటి రైతులు ఎంతమంది వున్నారు? వాళ్ళకు నిజముగా కష్టమైతే వాళ్ళకు ఏ ధర కిట్టుబాటవుతుందనే సంగతి చూడవచ్చు భూమి యెక్కడుందో తెలుసుకోకుండా భూమి మొగము చూడకుండా సాగు ఎప్పుడూ చేయకుండా, కర్రపెత్తనం చేస్తూ, కూలీలచేతనో, కౌలుదారుల చేతనో వ్యవసాయం చేయించుకుంటూ అనుభవించేటటువంటి భూస్వాములకు లాభాలు చాలలేదంటే వాళ్ళకు ఎప్పుడూ లాభాలు చాలవు అందుచేత అటువంటివారి విషయంకాదు వారందరినీ రైతులనడం పొరపాటు. ఈ సంవత్సరం కూడా యేమి జరిగింది? Zones పెట్టిన తరువాత కూడా 25 రూపాయలకన్న ఎక్కువలేదు. కొత్త పంటలు వస్తున్నాయి బసంగిపంట మార్కెట్టులోకి రాకముందు పాతధాన్యం 22, 23 రూపాయలుంది ప్రభుత్వం ధర guarantee చేయలేకపోయేటప్పటికి యీ రోజు 17, 18 రూపాయలు అమ్ముతుంది. రేపు అదే రేటయినా వుండదు ఈ రెండోరకం అక్కుళ్ళు, కొణామణి మార్కెటులోకి వచ్చినప్పుడు యీరోజు 24, 25 రూపాయలమ్ముతున్న బస్తా రేపు 20 రూపాయలైనా అమ్ముతుందా లేదా అని నా అనుమానము. అందుచేత నిజముగా రైతులలాభాన్ని శ్రేయస్సును కాపాడదలచుకుంటే ధరలు పెరిగిపోతున్నాయని, ఇంకాధరలు పెరగాలంటే కాదు మాములుగా కష్టపడిపనిచేసే పేద, మధ్యతరగతి రైతాంగం, మాసూళ్ళలో ధాన్యం అమ్ముకోవలసిన పరిస్థితులుండే రైతాంగం వాళ్ళు అమ్ముకునేటప్పుడు ధరలు తగ్గకుండా minimum ధర guarantee చేయాలని మేము కోరుతున్నాం. ఈ రోజు అన్నివస్తువుల ధరలు వేసుకున్నప్పటికీ బస్తా ధాన్యం 20 రూపాయలుంటే, బసంగి మూడవరకం ధాన్యం అయితే 18 రూపాయలు పెట్టండి.

వంకసన్నాలు, ఢిల్లీభోగాలయితే రెండు రూపాయలు అదనంగాపెట్టి 22 కు పెట్టండి, యింతకంటె ధర పడిపోనివ్వము "ఇంతకన్న ధర పడిపోయేటట్లయితే ప్రభుత్వం మార్కెట్టులోవచ్చి కొంటుంది" అని ముందు ఆ ధర fix-up చేసికొంటే అప్పుడు నిజముగా రైతుకు లాభం చేసినటువంటి వాళ్ళమవుతాము

ఈ రకముగా కొన్నధాన్యాన్ని ప్రజలకు అమ్మవలసివుంటుంది రకమును బట్టి ధర మణుగు 14, 15 రూ' లు అవుతుంది ప్రభుత్వము ధాన్యంకొని స్వయముగా వర్తకము చేయటము సాధ్యంకాదు. ముందుముందు సాధ్యమయితే అప్పుడు ఆలోచించుకోవచ్చును "ఈ మాసూళ్ళలో రైతులనుండి మణుగు బియ్యం 15 రు లకు తక్కువకాకుండా బస్తాధాన్యం 20 కు తక్కువ కాకుండా కాని, మీ ఖర్చులు లెక్క వేసుకొని మణుగు 16, 17 రు. అమ్మితే మీకు లాభంవుంటుందని" ప్రభుత్వం వర్తకులకు చెప్పవచ్చు. మార్కెటులో అంతకు మించి ధర పెరిగితే బియ్యం ఇవ్వకుండావున్న భూస్వాములనుండి ప్రభుత్వమే wholesale గా కొని ప్రజలకు అందచేయాలి కష్టబడిన రైతులకు కూడా 15 రు లకంటే ఎక్కువ ఇవ్వలేరు కాబట్టి అదేధర భూస్వాములకు కూడా ఇచ్చి ధాన్యం సేకరించటానికి ప్రభుత్వము పూనుకోవాలి మణుగు బియ్యానికి 15 రు రైతుకు ఇచ్చి 16, 17 రు లకు అమ్మితే ప్రజలు ఇబ్బందిపడరు. రైతులకు నష్టం వుండదు గ్రామసీమలలోని వ్యవసాయకూలీలు, పట్టణాలలో కార్మికులు, పేదప్రజలు చేనేతపారిశ్రామికులు మణుగు 16 రు లకు కూడా కొనుక్కొనేస్థితిలో లేరు కాబట్టి ప్రత్యేకంగా వారికి చౌకడిపోలు పెట్టాలి. తూకం ప్రకారము అయినా ఆ చౌకడిపోలలో రూపాయికి మూడు శేర్లు బియ్యం, 4 శేర్లు జొన్నలు చొప్పున ప్రభుత్వం అమ్మాలి దానివల్ల నష్టం వస్తే ఆ నష్టాన్ని ప్రభుత్వమే భరించాలి అనేకరకాలైన పన్నులు వేయగల్గినా కూడా "ఈ ప్రభుత్వం ఈ భారాన్ని భరించలేదు. కేంద్రప్రభుత్వమే ఈ భారాన్ని భరించాలని" వ్యవసాయశాఖా మంత్రిగారు చెప్పారు. కేరళకు యింకా ఇతర రాష్ట్రాలకు ఇస్తున్న కేంద్రప్రభుత్వము మన రాష్ట్రములోని కొరతప్రాంతములలో, తిండిలేని ప్రాంతములలో చౌకగా అమ్మటానికి సహాయం చేయమని అడిగినా చేయటంలేదని వారు చెప్పారు కేంద్రప్రభుత్వమును మన ప్రభుత్వం గట్టిగా వత్తిడిచేయాలి. దానికి మేము ప్రభుత్వముతో పూర్తిగా సహాకరిస్తాము. దానిని జయప్రదంగా కొనసాగించమని ప్రభుత్వమును కోరుతున్నాను మాసూళ్ళలో కొని మణుగు 16 రు. ల కంటె ఎక్కువగా అమ్ముతున్న భూస్వాములనుండి 15 రు. లకే ప్రభుత్వం కొని అమ్మటానికి పూనుకోవాలి అలా సేకరించిన ధాన్యమును ఇతర రాష్ట్రములకు పంపమని కేంద్రప్రభుత్వము మన ప్రభుత్వమును కోరినా "మా ఆంధ్ర రాష్ట్రములోని కార్మి

కులు, వ్యవసాయ కూలీలు తిండిలేక మలమల మాడిపోతుంటే మేము అక్కడకు పంపించలేము మాకు సరిపడే ధాన్యం మాకేలేనప్పుడు మేము కేరళకుగాని, కలకత్తాకు కాని పంపించలేము వాటికి అవసరమైతే విదేశాలనుండి అయినా, బర్మానుండి అయినా తెప్పించండి అంతేకాని మా ప్రజలు బాధపడుతుంటే మేము యింకోరాష్ట్రానికి ఎగుమతి చేయటానికి మేము ఒప్పుకోము, మా ప్రభుత్వం సహకరించదు, మేము దీనిని వ్యతిరేకిస్తున్నాము" అని మన ప్రభుత్వం కేంద్రప్రభుత్వముతో చెప్పాలి దానికి మేము సహకరిస్తాము అని నేను చెబుతున్నాను ఈ రోజు చాలామంది సభ్యులు తమతమ తాలూకాలలో వర్షాలు లేక ఏరకంగా మెట్టపైరులు వరిపైరులు దెబ్బతిన్నాయో చెప్పారు దానికి మంత్రిగారు 'ఈ మధ్య వర్షాలు పడుతున్నాయని అయినా మొత్తంమీద పంటలు తగ్గాయని' చెప్పారు మొత్తం స్టేటు అంతా తీసుకొని వారు ఇచ్చిన విషయం ఒకటి చదువుతాను 9 వ పేజిలో ఇట్లా వున్నది

"Taking the State as a whole, it may be stated that in delta areas, paddy production will be normal but in non-delta areas production of dry crops will not be more than 75% of the normal and regarding wet crops it is not likely to be more than 50% of the normal"

దీని అర్థం ఏమిటో మంత్రిగారు చెబితే బాగుంటుంది ప్రభుత్వం అతిశయోక్తిగా చిత్రించింది మెట్టపైరులలో సగానికి సగం నష్టపడింది ఎవరు చెప్పింది నిజమో భవిష్యత్తే రుజువుచేస్తుంది ప్రభుత్వ లెక్కలలో మెట్టపైరులలో మూడుపాళ్ళు పండి ఒక పాలు దెబ్బతిన్నదని వుంది గత సంవత్సరం 22 లక్షల టన్నుల ధాన్యం పండిందని ప్రభుత్వం లెక్కలు ఇస్తున్నది దానిలో నాల్గవ వంతు పోయిందంటే 5½ లక్షల టన్నులు మెట్టధాన్యం తగ్గుతుంది. డెల్టాప్రాంతములలో వరిధాన్యం మామూలుగా పండిందని చెప్పారు కాలువలలో నీరు పారుతున్నమాట నిజమే కాని వర్షంలేకపోయినా కాలువలలో నీరు పారుతున్నంత మాత్రాన మామూలు పంట పండుతుందనే మాట సరైనదికాదు సకాలములో వర్షంవుండి, కాలువలలో నీరువున్నప్పుడే సరైనపంట పండుతుంది కాని లేకపోతే పంటకు నష్టంవస్తుందనే విషయాన్ని మంత్రిగారు-అంగీకరిస్తారని అనుకొంటున్నాను. డెల్టాప్రాంతాలలో గ్యారెంటీ కాలువక్రిందగాని, ప్రభుత్వ కాలువ క్రింద గాని 37 లక్షల ఎకరాల భూమి వున్నది నాన్ గ్యారెంటీడ్ కాలువలక్రింద చెఱువులక్రింద మెట్టపైరులు పండే భూమి 32 లక్షల ఎకరాలు వుంది. ఈ 32 లక్షల ఎకరాలలో వరి సగానికి సగమే పండుతుందని మంత్రిగారు ఒప్పుకొన్నారు మన ఆంధ్రప్రదేశ్‌లో 35 లక్షల ఎకరాలలో 33లక్షల టన్నుల బియ్యం పండితే అందులో 17, 18 లక్షలు డెల్టా క్రింద పండాయని అనుకొన్నా మిగిలిన 13, 14 లక్షల టన్నులు చెఱువుల క్రింద, మెట్టప్రాంతా

లలో, గ్యారెంటిలేని ప్రాంతాలలో పండుతుంది అన్నమాట. దానిలో సగము దెబ్బతిన్నా 6, 7 లక్షల వరిధాన్యం తగ్గుతుంది కనుక మొత్తంపై 6 లక్షల బియ్యం, 5 లక్షల జొన్న మొత్తం 11 లక్షల ఆహారధాన్యం తగ్గినా ప్రభుత్వం చెప్పిన 14 ఔన్సుల ప్రకారం చూచినా యింకా 49 లక్షల టన్నులు కావాలి ఆంధ్రరాష్ట్రములో గత సంవత్సరము 54 లక్షల టన్నులు పండితే ప్రభుత్వం చెప్పిన లెక్కల ప్రకారం 12లక్షల టన్నులు ఆహారధాన్యం తక్కువఅవుతుంది ఈ సంవత్సరం సకాలములో వర్షాలు లేకపోవటం వల్ల 12 లక్షల టన్నుల ఆహారధాన్యం తగ్గుతుంది అన్నమాట ఒకపూట తినేవారు, రెండుపూటలా పస్తువుండేవారు, గంజినీరు త్రాగేవారు వున్నా, 5లక్షలు ఎగుమతిచేసి సర్ప్లస్ అని మురిసిపోయే మనకు ఈసంవత్సరం ఆ surplus లేకుండా యింకా 7లక్షలు దిగుమతి చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది అంటే ఆంధ్రదేశంలో ఆహార పరిస్థితి ఎంత తీవ్రముగా వుందో ఆలోచించవలసివుంది కరువు వచ్చి ప్రజలు అల్లాడిపోతున్న రోజున ఏదో మార్గం వెతకటం యిల్లు తగులబడుతుంటే నూయి త్రవ్వటం ప్రారంభించినట్లుగా వుంటుంది దురదృష్టవశాత్తూ వర్షాలు సక్రమంగా కురవనందువల్ల ఈ పరిస్థితి ఏర్పడిందనే సంగతి దృష్టిలో వుంచుకొని దానిని గురించి ఏ చర్య తీసుకోవాలో ప్రభుత్వం ఆలోచించవలసియుంది లేకపోతే కరువువచ్చి సరైన తిండిలేక ప్రజలు కటకటలాడే పరిస్థితి ఆంధ్రదేశానికి వస్తుంది మాసూళ్ళు రాబోతున్నాయి ఈ మాసూళ్ళలో అమ్ముకొనే రైతులకు ధరలు పడిపోతాయి అందుచేత మేము కోరినరీతిగా ధాన్యం, జొన్నలకు కనీస ధరను నిర్ణయించాలి అంతకంటే తక్కువ ఖరీదుకు అమ్మవలసివస్తే ప్రభుత్వమే కొని నిల్వచేసి, ఎక్కడ అవసరమైతే అక్కడ అమ్మటానికి, బీదప్రజలకు చౌకడిపోలు తెరచి వాటిలో అమ్మటానికి ఈ ధాన్యమును వినియోగించాలి ఆహారధాన్యాలు తగ్గే పరిస్థితులు కన్పిస్తున్నాయి. ధరలు విపరీతంగా పెరిగే ప్రమాదంవున్నది ఏ షావుకారు, ఏ భూస్వామి మణుగుబియ్యం 17 రు లకు మించి అమ్మకూడదు, అలా అమ్మినట్లయితే 15 రు లకు procure చేస్తామని ప్రభుత్వం చెప్పవచ్చు అలా తీసుకొనే హక్కు Essential Commodities, Requisition Act క్రింద రాష్ట్రప్రభుత్వానికి వుంది. ఆరకంగా ధరలు fix up చేసి procure చేయాలి అలా చేస్తే తిండి పెట్టలేకపోయినా, కనీసం వున్నదాంట్లో గంజినీరయినా పోసి బీదప్రజలను బ్రతికించే వీలు వుంటుంది మీరు చెప్పినరీతిగా ధరలు పెరగటంలేదు. అలా గిట్టుబాటు కావటంలేదు కనుక యింకా పెరగాలి, అని చెబుతూ వుంటే అనావృష్టి వల్ల ఆహారధాన్యాలు తక్కువగా వున్న పరిస్థితిలో, కరువు రాబోయే పరిస్థితులలో, ఏర్పడే గడ్డుస్థితిని మనము ఎదుర్కోవలసివస్తుంది. ఆకలిబాధలకు గురికావలసివస్తుంది.

చౌకడిపోలు పెట్టినంతమాత్రాన ఈ సమస్య పరిష్కారమవుతుందని నేను అనుకోవడం లేదు చౌకడిపోలు పెడితే కాస్తో కూస్తో డబ్బున్నవారు —వారు కూలీలుగాని, పేదప్రజలుగాని, చేనేత పారిశ్రామికులుగాని ఎవరైనా గాని—రూపాయికి 3, 4 శేర్లు అమ్ముతూంటే కొనుక్కోవచ్చు, సంతోషమే ఈనాడు జొన్నలు రూపాయకు 2 శేర్లు కొనేబదులు, 4 శేర్లు కొనుక్కుంటే కొందరికి ఉపయోగంగా ఉంటుంది అదేవిధంగా బియ్యంకూడా 1½ శేర్లు అమ్మే బదులు 3 శేర్లు అమ్మితే చాలామందికి ఉపయోగపడుతుంది కాని ఆరూపాయి కూడా లేని ప్రజలు—సంవత్సరంలో రూపాయి దొరకని రోజులు చాలావుండే ప్రజలుకూడా—వుంటారు వ్యవసాయ కూలీలు కొన్నితరుణాలలో, పట్టణాల లోని కొంతమంది కొన్నితరుణాలలో పనులులేకుండా ఉంటున్నారు అందు చేత, మన ప్రజలు తిండి తినాలి, కనీసం గంజిత్రాగి అయినా బ్రతకాలంటే వారికి పని చూపించవలసివుంటుంది పనిలేని సందర్భాలలో వారికి పని చూపించాలి అందుకై ఇరిగేషన్ పనులు మొదలు పెడదామా, అభివృద్ధి కార్యక్రమాలు తీసుకుందామా అన్నాకూడా ఆలోచించవలసి వుంటుంది మామూలుగా తిండితినడానికి, కనీసం గంజినీరుత్రాగడానికయినా రూపాయి, 12అణాలు 8 అణాలు కూలి యిచ్చే పనులు కల్పించాలి, అట్లా పనులు చూపించని రోజున వారికి ఉచితంగా తిండిపెట్టాలి కనీసం ఒకపూట అయినా తిండిపెట్టాలి కరువు భారానికి పని అయినా చూపించాలి, కరువు భత్యం అయినా యివ్వాలి. ఈ బాధ్యతకూడా ప్రభుత్వం మీద ఉన్నది ఈ రీతిగ చేయనంతకాలం మన ఆహార సమస్యను తీర్చలేము ప్రభుత్వం ఎంతవరకూ జయప్రదంగా, పూర్తిగా పరిష్కారం చేయగలదనే సంగతి వేరు విషయం ఈ ధోరణితో ఆలోచించి చర్యలు తీసుకుంటే అందరూకూడా సహకరించవచ్చు బయట ఎన్ని భేదాభిప్రాయాలున్నా ఈ విషయంలోమాత్రం అన్నిపార్టీలూ కలిసి ఆకలితో మల మల మాడిపోతున్న ప్రజలకు తిండి చూపించవలసి యున్నది కనీసం వారికి గంజినీళ్ళు పోయడానికయినా మనం కుస్తీ పట్టనవసరంలేదు మిగిలిన అనేక విషయాలలో భేదించినప్పటికీ, ఈ విషయంలో పూర్తిగా సహకరించి మా శక్తికొలదీ సేవచేయడానికి మేము తయారుగానే ఉన్నామని మంత్రిగారికి చెబుతున్నాను. పంటలు దెబ్బతిన్న ప్రాంతాలలోని చిన్నరైతులకు (మాగాణి ప్రాంతం అయితే 5 ఎకరాలు, మెట్ట ప్రాంతం అయితే 25 ఎకరాలు కలిగి పంటలు పండించే రైతుకు) అప్పులు దొరకడం ఉండదు దొరికితే చెల్లించుటకు వుండదు. అందువల్ల వారు వ్యవసాయం చేసుకోడానికి కావలసిన విత్తనాలు యిచ్చి, కావాలన్న అప్పులు యిచ్చేందుకు ప్రభుత్వంవారు తగిన చర్యలు తీసుకోవలసి వుంటుంది. ఈనాడు ప్రభుత్వం యిచ్చిన లెక్కలప్రకారం అనావృష్టివల్ల ప్రతి సంవత్సరంకంటే ఆహారపు పంట 12½ లక్షల టన్నులుతగ్గింది.

ఆంధ్రరాష్ట్రంలో కూడా తీవ్రమైన ఆహారకొరత ఏర్పడే పరిస్థితి ఏర్పడుతోంది కాబట్టి ప్రభుత్వం వారు ఈ సంగతి గుర్తించి ఇకనుంచైనా యిది మన చేయి దాటకముందే చర్యలుతీసుకోవాలి లేక, "ఇది సంతృప్తిగానే ఉన్నది, ఎక్కడో కొన్నిచోట్ల కొద్దిగా పంట తగ్గిందితప్ప, బాగానే వుంది" అని అలసభావంతో చూస్తేమాత్రం, ఆంధ్రరాష్ట్ర ప్రజలయెడల తిండియిచ్చే విషయములో మన కర్తవ్యాన్ని నెరవేర్చక, దేశంలో సంక్షుభిత పరిస్థితి తీసుకురావడానికి మార్గం అవుతుంది కాబట్టి మంత్రిగారు, ఈ విషయాలను జాగ్రత్తగా ఆలోచించాలని కోరుతూ నేను ముగిస్తున్నాను

* శ్రీ పి తిమ్మారెడ్డి అధ్యక్షా, 13, 14 మంది గౌ॥ సభ్యులు చాలా పట్టుదలగా రాష్ట్రంలో వుండే ఆహారపరిస్థితిని గురించి సమీక్షించారు ఉపన్యాసాలు వింటుంటే కొన్ని తెలియనివిషయాలు కూడా తెల్సుకోవడం జరుగుతూ ఉంటుంది ఆ తెల్సికోవడంలో లెక్కాచారంకూడా తెల్సికోవడం జరుగుతోంది నేను లెక్కలలో చాలా weak సుందరయ్యగారు లెక్కలలో **optional** ఏమో, తెలియదు

శ్రీ పి సుందరయ్య · నా చదువు **school-final** వరకేలెండి అందుచేత పెద్దగొప్పగా చెప్పవలసిన అవసరం లేదు

శ్రీ పి. తిమ్మారెడ్డి · నేను కాలేజీలో చదివినాకూడా లెక్కలతో సంబంధం లేకుండానే పోయింది గడచిన సంవత్సరానికి సంబంధించిన లెక్కలు అంకెలు యిక్కడ ఉన్నాయి అవి 100 అయ్యేటట్లుగా వుంటే యిప్పుడు చూపే 25% ఎంత ఉంటుంది ? లేక అది 100 అయితే, యిక్కడ చూపే 50% ఎంతవుంటుంది అనేలెక్కలు తీసినట్లుంటె మన ఎదుటవున్న పంటల లెక్కలు తీసుకొంటే 100% పండినప్పుడు యిచ్చిన మొత్తమా లేకపోతే ఆ సంవత్సరంలో కూడా పంటలు తగ్గిపోయివుండి, ఆ పంట పండినదా అనే విషయం యింతవరకూ మనస్సుకు వచ్చినట్లులేదు గడచిన సంవత్సరంలో తెలంగాణా మేరకు నల్లగొండజిల్లాలో, అదనంగా మహబూబ్‌నగర్ జిల్లాలో గద్వాల, అలంపురం తాలూకాలలో పంటలు చాలా చెడిపోయాయి ఈ సంవత్సరం రాయలసీమ ప్రాంతంలో పంటలు చెడిపోయాయని ఎక్కువ ఆందోళన ఉన్నది. గడచిన సంవత్సరంకంటే ఈ సంవత్సరం ఈ ఆహారపంటలవిషయం మేలుగానున్నట్లు వినవస్తున్నది. అలాంటి పరిస్థితులలో ఈ లెక్కలను తారుమారు చేసి చెప్పినట్లయితే వెంటనే జవాబు చెప్పలేను. నేను లెక్కలలో చాలా వెనుకబడినవాడను.

శ్రీ పి. సుందరయ్య ప్రభుత్వంవారిచ్చిన లెక్కలు గతసంవత్సరం పండిన పంటవి కొన్నిస్థలాలలో తక్కువపండితే పండవచ్చును అంతకుముందు ఏ సంవత్సరంలోనైనా పండిన పంటకన్నాకూడ ఆంధ్రరాష్ట్రంలో గతసంవత్సరం అదనంగా పంట ఉంటుంది, అని వరుసగా 5, 6 నెలలనుంచి లెక్కలు యిస్తున్నారు

శ్రీ పి తిమ్మారెడ్డి ఆ లెక్కలమీద ఆధారపడినట్లయితే, ఆ లెక్కల ప్రకారమే తిండితినేటట్లయితే ఆ లెక్కలప్రకారమే సరాసరినివచ్చే విధంగానే ప్రజలు అనుభవించినట్లయితే లోకం ఏమవుతుందో మనం చెప్పలేము కాని, కొన్ని ఆధారాలున్నాయి, వాటినిబట్టి లెక్కలు తయారు చేశారు ఇదే perfection, యిది యింతే అని చెప్పడానికి అవకాశం లేదు ఇదివరకు కొంత మంది లెక్కాచారంచేసి ఆంధ్రరాష్ట్రం surples గా వున్నదన్నారు ఈనాడు కొందరు సభ్యులు లెక్కలువేసి double, treble గా కూడా deficit ఉన్నదని రుజువు చేస్తున్నారు ఈ లెక్క కాదు, దేశంలో ఎంతతిండి ఉన్నదంటారు! నిన్ననే బనానా షో జరిగింది ఎకరానికి average న 10 టన్నుల అరటి పండుతున్నదని అంతా ఒప్పుకొన్నారు ఇది మనదేశంలో 30 వేల ఎకరాలలో పైగా అవుతున్నది అంటే 3 లక్షల టన్నులు అరటికాయ పండుతోంది 1,70,000 ఎకరాల మామిడితోటలున్నాయి ఎకరానికి కనీసం 4 టన్నులు పండుతోందంటారు అంటే దాదాపు 7 లక్షల టన్నులు పండుతుంది. ఈ రెండు విషయాలనూ కనబరుస్తున్నాను ఈ విధంగా అనేకరకాల తిండి ఉన్నది దేశంలో ఇక ఆంధ్రదేశంలో పాలు, పెరుగు ఎంత ఉత్పత్తి అవుతున్నదో నాకు తెలియదు. ఒక్క కలకత్తా మార్కెట్టుకు ఆంధ్రదేశంనుంచి 1,20,00 000 నెయ్యి వెడుతోంది అందరూ తినేవారు లేరనుకోండి, నేను సభ్యులతోపాటు అంగీకరిస్తాను. తినేవారు, అనుభవించేవారు కొంతమందే ఉండవచ్చు అనుభవించడానికి శ్రమకావాలి కూలిలేదని కొందరు సభ్యులు అంటున్నారు కూలీలు దొరకక బాధపడే గ్రామాలు ఎన్నో ఉన్నాయి. కూలీలులేక, ఎన్ని పనులు ఆగిపోతున్నాయో సభ్యులు కొంచెం ప్రయత్నించి చూచినట్లయితే తెలుస్తుంది "ఆ కూలీ యిచ్చినట్లయితేనే నీవు వెళ్లు, లేకపోతే వెళ్ళకు యింటి దగ్గరే కూర్చో, ఆ కూలి యివ్వకుండా ఎట్లాపని చేయించుకో గల్గుతాడో చూద్దాము". అతడు కాంట్రాక్టరు కావచ్చు, రైతుకావచ్చు, వ్యాపారస్థుడు కావచ్చు" అని ప్రక్కన సలహాలిచ్చేవారు చాలామంది ఉంటారు "మాకే హృదయం ఉంది, యింకెవ్వరికీ హృదయంలేదు అనుకోవడం" అంత మంచిది కాదు హృదయం అందరికీ ఉన్నది. ఏ పార్టీఅయినా సిద్ధాంతాలు మట్టుకు కర్కశంగా వుండవచ్చు, కాని కాంగ్రెసు పార్టీవారి సిద్ధాంతాలు మట్టుకు

మిగతా పార్టీలకంటె మానవత్వంమీదనే ఎక్కువగా ఆధారపడి వున్నాయి కాంగ్రెసుపార్టీ పేరుతో నడచుకొనే మనుష్యులు చాలామంది ఉన్నారు ప్రతి పక్షసభ్యులు "భూస్వాములు" అంటే నేను "రైతులు" అనే అంటున్నాను తాము కూడా భూస్వాముల వర్గమనండి లేక రైతువర్గం అనండి. ఈనాడు కొంతమందికి ఫలానవర్గం అని చెప్పుకోడానికి కూడా అవకాశం లేదు నేను రైతువర్గంనుంచే వచ్చాను నీవు నన్ను భూస్వామిఅను, మధ్యరకపు రైతు అను, లేకపోతే చిన్నరైతుఅను, ఏమైనాసరే అను, కాని నేనువచ్చింది రైతాంగంనుంచే. నాకు రైతాంగంసంగతి అంతాతెలుసు

మిస్టర్ స్పీకర్ . మీరు స్పీకర్‌ని addess చేస్తే చాలా తగువులు పోతాయేమో

శ్రీ పి తిమ్మారెడ్డి ఆ విధంగానే అధ్యక్షా! ఆంధ్రదేశంలో నున్న రైతాంగం అంతా మధ్యరకంవారే ఎక్కడైనా గొప్ప భూస్వాములు ఉన్నారంటే తాలూకాకు, జిల్లాకు ఒక్కరో, ఇద్దరో, నలుగురో పదిమందో వుండవచ్చును కాని, వాళ్ళకుకూడా ఇప్పుడు కొంచెం అదురు బెదురు వచ్చింది; ఏ reform లు వస్తాయో ఎలాంటి పరిస్థితులు వస్తాయో అని చెప్పి ఎక్కడి కక్కడ అమ్ముకోవడమో, లేకపోతే ఎవరికోఒకరికి ధారాదత్తం చేయడమో, ఏదోఒకటి చేసిపారేస్తున్నారు ఈ పరిస్థితులలో భూస్వాములు, భూస్వాములు అని, అరవటంలో అర్థమేమిటి? లేకపోతే ఈ సిద్ధాంతాలను ఏ దేశంలోనో ఎక్కడో అక్కడ, ఆ దేశంలోఉండే పరిస్థితులను బట్టి, అక్కడి ప్రభుత్వాన్ని బట్టి, భూస్వాములని ఆయా దేశాలలో పెద్ద భూస్వాములు దుర్మార్గంగా ఉండటంవల్ల అలాంటిదానికి సావకాశము వచ్చిందేమో కాని, ఈ దేశంలోని భూస్వాములు మటుకు తమ చుట్టుప్రక్కలనున్న చిన్నరైతాంగాన్ని కాని కూలీలను కాని అన్నదమ్ముల వావివరుసలతో పిలుచుకుంటూ ఇరుగుపొరుగు వారితో ఒకే కుటుంబంమాదిరిగా ఉంటారు. కూలీలను, రైతులను విడదీయటం అనే దౌర్భాగ్యస్థితి ఇప్పుడు గ్రామాలలోనికి కూడ పోతున్నది కూలీకేదైన అవసరంవస్తే అన్నివిధాలా మనదేశంలోని రైతాంగం ఆదుకుంటారు. కూలీల యింటిలో ఏవైనా పండగలు, పబ్బాలు, పెండ్లిండ్లు జరిగితే అక్కడ ఉండే రైతాంగం పోయి వాళ్ళయింటిముందు కూర్చొని వాళ్ళకు కావలసిన వసతులు చూచేవాళ్లు ఈ దేశంలో కూలీలయిండ్లలో ఏదైనా రోగం, రొష్టూ వచ్చేట్లుగాఉంటే రైతులు వాళ్ళను ఆస్పత్రులకు తీసుకపోయేవాళ్ళు, వాళ్ల కుటుంబాలను ఆదుకొనేవారు. ఈ దేశంలో కొందరు రైతులను వేరుగా కూలీలను వేరుగా చేసినారు కొంతకాలం. అదిమటుకు ఎంతకాలంసాగింది. అది

మళ్లీ అడ్డం తిరిగింది. అది మొన్న మొన్ననే కన్పించింది రైతులు, కూలీలు వాళ్ళిద్దరూ కూడా కలిసి సేద్యంచేసి బ్రతుకుతూ ఈ దేశాన్ని బ్రతికిస్తున్నారనే సంగతి మొన్న మొన్ననే ఈ సంవత్సరం ప్రారంభంలోనే రుజువైనది అలాంటి పరిస్థితులలో కూలీలను కాదని, కూలీలను ఏడ్పించాలనేటటువంటిది రైతుల ఉద్దేశ్యం కాదు ప్రధానంగా రైతులకు కూలీలకు అవినాభావ సంబంధం ఉంటుంది రైతు కూలీలకు కూలిని ధాన్యంరూపంలోనే యిస్తాడు ఏ ఒక దినమైనా ధాన్యం రూపంలో కూలి యిచ్చేదానికి అవకాశం లేదో ఆ దినం ఉన్న ధాన్యంధరలనుబట్టి రైతు కూలి యిస్తున్నాడు ఆంధ్రదేశంలో పూర్తిగా మిరపకాయల సేద్యానికి వెళ్ళినపుడు మిరపకాయలే కొన్ని అందాజ్‌గా కూలి క్రింద పెడుతూంటారు ప్రత్తి ఒడిపే దానికి వెడితే వాళ్ళు అక్కడ కూలీక్రింద కొంత ప్రత్తిని అందాజ్‌గా పెడుతుంటారు సాధారణంగా ఈ రకంగా రైతులకు కూలీలకు సంబంధం ఉంటే, వారిద్దరినీ వేరుచేయాలని ఉపన్యాసాలు యిస్తున్నారు ఉపన్యాసాలు prepare అయి బాగానే చేయవచ్చు, పుస్తకములను చూసి, వాటిలో నున్న మాటలను ఏర్చుకుంటె, ఉపన్యాసం బాగానే ఉంటుంది సినిమా చూస్తుంటే, సినిమాలో తెరమీద ఏడిస్తే చూచేవాళ్ళకు ఏడుపొస్తుంది అక్కడ వర్ణిస్తుంటే, సంగీతం విన్నా, అక్కడ వారు చేస్తున్న action చూసినా సరే, అయ్యో ఎంతబాగా ఉన్నదో అనిపిస్తుంది. చిన్నపిల్లలు అడుగుతూంటారు, "ఇదుగో ఫలానా ఆయమ్మ స్టారు, ఫలానా ఆయన స్టారు ఈ సినిమాలో అన్నాచెల్లెలు మాదిరి నటన చేసినారు ఈ సినిమాలో ఆలుమగుడుగా నటన చేసినారు ఈ సినిమాలో అమ్మాకొడుకు మాదిరి నటన చేసినారు. ఈ సినిమాలో అబ్బా కూతురు మాదిరిగా నటన చేసినారు" అని చెప్పి, ఈ నటనాచాతుర్యం గల విధానంతో ప్రజలముందర, ఈ సభ ఎదుటనయినా సరే ఉపన్యాసాలను సారవంతంగానే చేసేటట్లు ఉంటే, చూసేవాళ్ళకు, విన్న వాళ్ళకు అయ్యో అనిపిస్తుంది.

శ్రీ పి. సుందరయ్య . మంత్రిగారి ఉపన్యాసమే ఇందుకు ఉదాహరణ.

శ్రీ పి. తిమ్మారెడ్డి : అధ్యక్షా, ఈ నటన మామూలుగా రాజకీయాల్లో జరుగుతుండేదే. అంటే నేను ఇక్కడ ఇవన్నీ ఎందువల్ల మనవిచేస్తున్నానంటే వాస్తవిక పరిస్థితులను సమీక్షించకుండా ఈ నాటి కొందరి సభ్యుల ప్రసంగాలకు సమాధానం చెప్పడం సాధ్యంకాదు. "ఎక్కడనో కన్నీళ్లు, రక్తాలు ఇవన్నీ తీసుకు వస్తున్నారు, సుందరయ్యగారు" పెద్ద పెద్ద సిద్ధాంతాలు చెప్పుతున్నారు. ఏదో కరువు భత్యాలనైనా చూపించాలి, అది చేయాలి, ఇది చేయాలి అన్నారు. ఇవన్నీ కూడా రాసుకొనేటట్లుగా ఉంటే చాలా బాగా ఉంటాయి. కాని

ఆచరణలోనికి వచ్చేప్పటికి అందుకు పైసలు కావాలి ఈ దినం దేశంలో పని చేసేవాడు 8 గంటలు పనిచేస్తూఉన్నాడు చేసిన గంటసేపైనాసరే వాళ్లను పూర్తిగా హృదయపూర్వకంగా పనిచేయనిస్తున్నారా? అలాంటి సిద్ధాంతాలను శ్రామిక జనులలో ప్రచారంచేస్తున్నారు పని చేయవద్దంటే, పని తగ్గించేస్తే ఎట్లాగు పిండి లేకుండా రొట్టెలన్నీ ఎక్కడినుంచి వస్తాయి ? దేశంలో ఉత్పత్తి పెరగాలి, నీళ్ళు తక్కువగా ఉన్నాయి గూడలు వేస్తారో, లేకపోతే కపిల తోలిస్తారో తెలియదు ఏవిధంగానైనాసరే కష్టపడి రైతులు, కూలీలు పనిచేసి, నీరు సంపాదిస్తారనేదానిని మనందరమూ చూస్తూనే ఉన్నాము ఎక్కడనైనా సరే మనం చూస్తాం, రైతు రాత్రింబవళ్ళు కష్టపడితేనే, ఒక్కొక్కప్పుడు రైతు పొలంలోనే యింటికి రాకుండావుండి పనిచేస్తాడు రైతు, రైతుతోపాటు కూలీలు కలసి కష్టపడుతుంటే వాళ్లకు వెనుకప్రక్కనుంచి, ఒరే మీరు సరిగా పనిచేయవద్దని కూలీలను ప్రోత్సహించడం జరుగుతోంది పని సరిగా చేయకపోతే పంటలు తగ్గిపోతాయి పంటలు తగ్గిపోయేట్లుగా వుంటే పంపకానికి కూడా తక్కువ వస్తుంది ఇప్పుడు ఈలాంటి పరిస్థితులు ఉన్నాయి ఈ దినం ప్రభుత్వం ఏదో మీరనుకున్నంత అశ్రద్ధగా లేదు. ఈ ఆహార విషయంలో ప్రభుత్వం కూడా పట్టుదలగా ప్రయత్నంచేస్తున్నది కేంద్ర ప్రభుత్వం కేరళప్రభుత్వానికి ధాన్యం యిచ్చింది ఆంధ్రదేశానికి యివ్వలేదంటే, దానికొక కారణం ఉంది కేంద్ర ప్రభుత్వం ఒక యోచనలో పడింది. ఆంధ్రదేశంలో ధాన్యం surplus గా ఉంటుంది కదా! ఆంధ్రదేశానికి కూడా centre సహాయంచేయాలా! అని. కేంద్రప్రభుత్వానికి మేము మాకు ధాన్యం సహాయం చేయాలని తెలియ పరచాము మీరు మణుగు 16 రూపాయలు అని చెప్పారు మాకు తెలియదు కాని ఇక్కడ మామూలుగా మార్కెట్టులో ఉండేధర 16 రూపాయలకుపైగా ఉంది 16 రూపాయలకు కేరళకు కాని ఇతరప్రాంతాలకు కాని, కేంద్ర ప్రభుత్వం సరఫరా చేసేటపుడు ఆ ధరకాడికే మనకు యిస్తే బాగుంటుందనే ఆలోచన మనకు పుడుతుంది అది సహజమే Kurnool మునిసిపాలిటీ తీర్మానం pass చేయడం సహజమే కేంద్రప్రభుత్వం ఈ ధరకు ధాన్యం సరఫరా చేస్తున్నపుడు ఈ విధానంమీద, దానినిగురించి discuss చేయాలని, ధాన్యం ధర తగ్గడమనే విషయం ఉండడం సహజమేనని మీకు మనవిచేస్తున్నాను ఆకలి యాత్రలగురించి కొంతమంది సభ్యులు చెప్పినారు. ఆకలియాత్రలు తీర్మానం ప్రకారం, circular ప్రకారం, ఎక్కడెక్కడ ఎవరెవరు నడుపుతారో ఏవిధంగా చేస్తారో అవన్నీ మీకుతెలుసు దానినిగురించి ప్రభుత్వంపెద్దగా ఆందోళన పడవలసిన పనేమీ లేదు. కాని రాష్ట్రంలో పరిస్థితులు అంటారా ? ప్రభుత్వం ఒప్పుకున్నది. ముఖ్యమంత్రిగారు బహిరంగంగా చెప్తున్నారు. Revenue మంత్రి గారు ఒప్పుకున్నారు. ఇదివరకే పంటవిషయంలో Collectors కు ఆదేశాలు

యివ్వబడ్డాయి ఎక్కడెక్కడ ఏఏ జిల్లాలలో ఏఏ తాలూకాలలో ఏగ్రామాలలో నైనాసరే, పంటలు చెడిపోయినా, వర్షాభావంచేత పంటలు బాగా దెబ్బ తిన్నా లేక అక్కడక్కడ అధికవర్షాలవల్ల కూడా పంటలు దెబ్బతిన్నా ఆ విషయాలన్నీ వివరంగా ప్రభుత్వానికి త్వరలో పంపవలెనని ఆదేశాలు కలెక్టర్లకు పంపబడ్డాయి ప్రభుత్వం తగుశ్రద్ధతో ఉంది నిన్న మొన్న చూస్తున్నాము నెల్లూరు జిల్లాలో, సుందరయ్యగారు ఆ జిల్లావారే కాబట్టి అక్కడ చాలా వర్షం పడుతోంది.. ..

ఒక గౌరవసభ్యుడు కృష్ణాజిల్లా అండి

శ్రీ పి. తిమ్మారెడ్డి గూడూరునుంచి మద్రాసుకు రైళ్ళు పోయేదానికి కూడా వీలులేకుండా రెండురోజులనుంచి నిలబడి పోయాయి అధ్యక్షా, నేను ఒకటే మనవి చేస్తున్నాను రైతు పంటపొలాలలో ఉండి వెన్ను నోటకరచు కొని ఇంకా రెండుతళ్ళు పారితే అది పండేస్తుందని అనుకొనే సమయంలో నీళ్ళులేకుండా పోయేటట్లయితే, అనుకొన్నట్లుగా దేవుడు దయచూపకుండా ఉంటే రైతుకు కన్నీళ్ళు కారుతూంటాయి అతనికి ఇతర సంపదలు లేవు కూలివాడయినా సరే, ఎంత రిక్షావాలా అయినాసరే, towns లో వారంలోనో ఒకరోజు అతనికి సెలవు దొరుకుతుంది సాయంత్రం అయేటప్పటికి చింతలేకుండా పావలాయో, అర్ధరూపాయో సంపాదిస్తాడు సాయంత్రంఅయ్యే టప్పటికి తన బ్రతుకును గురించి కాని, తన పనినిగురించికాని, తెల్లవా రేంతవరకు, మళ్ళీ పనికి పోయేంతవరకు ఫ్యాక్టరీ మరల ఈలవేసేంతవరకు లేకపోతే ఫ్యాక్టరీలో గంటకొట్టేంతవరకు అతనికి వేరేచింతలేకుండావుంటుంది కాని రైతు పరిస్థితి ఈవిధంగా సెలవంటే ఏమిటో, విరామం అంటే ఏమిటో, విశ్రాంతి అంటే ఏమిటో తెలీదు తనపొలం, తన పశువులు, తనేమో అంత కంటే ప్రపంచంతో సంబంధంలేదు అతనికి పండగలు, పబ్బాలనేవేలేవు ఏ పండగయినా సంక్రాంతే కావచ్చు ఉగాదే కావచ్చు ఆ దినంకూడా గొడ్ల దగ్గరనో, పొలంలోనో పనంతా చేసినతరువాతనే ఇంటికివస్తే ఏదో పెళ్ళాం చేసినది ఇంతో అంతో తిండో, తీర్థమో, తింటూ వుంటాడు ఒక్కదినంకనుక రైతు తన పనిమానేసి వచ్చేటట్లుగా ఉంటే మన స్నేహితులు ఆకలియాత్రలు నడపగలరా ? 100 మైళ్ళో 5 నూరుమైళ్ళో యాత్రలు నడపగలరా ? కాని ఈ యాత్రలకు పోయేటటువంటివారు కనుక పనులు నిలిపేసేటట్లుగా ఉంటే factory పడుకొని ఉంటుంది. మిల్లు నిద్రపోతూ వుంటుంది. కాని రైతుకనుక ఈ రకమయిన demonstration అకే కాని తన పనిని, నిలిపి నడిపేటట్లుగా ఉంటే దేశమంతా ఎండుకుపోతుందని నేను మనవి చేస్తున్నాను. రైతు తన

బాధ్యతను విడిచిపెట్టే మనిషికాదు Police తన duty ని విడచిపెట్టవచ్చు, పద వులలోనున్న మనం, మన duty ని ఏమారవచ్చు, ఏదో ఈదినం వళ్ళు బాగా లేదని ఊరికినే ఉండేదానికి అవకాశం ఉంది ఎవరయినా తమ duty ని ఏమార డానికి వీలుందికాని రైతుకు తన duty ని ఒకదినం ఒక గంటకుముందు చేయ వలసిన పనిని సమయానికి చేయకుండా చేయకపోయేటట్లుగా ఉంటే దేశమే మాడిపోయేదానికి అవకాశాలున్నాయి ఇలాంటి పరిస్థితిలో మన లచ్చన్నగారు ఏదో గంభీరంగా మాట్లాడారు నరసింహారావుగారు ఈపొద్దు మాట్లాడుతారను కొంటిని, నిన్న ఆయన చేసిన ఉపన్యాసానికి ఈ పొద్దు మాట్లాడిఉంటే దానికి comparison ఎట్లా ఉంటుందో చూద్దామని అదేపనిగా చూస్తూ ఉన్నాను కాని ఆయనకు అవకాశం లేకపోయింది నిన్నటిదినం ఆయన రైతులగురించి చేసిన ఉపన్యాసం బ్రహ్మాండంగా ఉన్నది ఆయన వ్యవసాయం చేయకపోయినా చూసైనా ఉంటారు మంచి అనుభవం ఉందనుకుంటాను నేను అంత గంభీ రంగా ఉపన్యాసం చేసినారు రైతుకు వ్యవసాయపు ఖర్చులు ఏవిధంగా పెరిగి నవో వాళ్ళు పొలానికి సంబంధించిన కార్యములలో ఏవిధంగా అనేక బాధలు పడి చస్తున్నారో అలాంటి పరిస్థితులను చాలా చక్కగా చిత్రించారు తమ ఉద్దేశం కూడా చెప్పారు ఈనాడు ధర విషయంలో రూ 15 లు అంటున్నారు సుందరయ్యగారు ఐతే దేనినిబట్టి రూ 15 లు అంటున్నారు ?

శ్రీ పి సుందరయ్య అన్ని లెక్కలనుబట్టి నేను చెబుతున్నాను

శ్రీ పి తిమ్మారెడ్డి ఈనాడు లెక్కలను సుందరయ్యగారు తయారు చేయలేదు నేనూ తయారుచేయలేదు కేంద్రప్రభుత్వం కూడా చేయలేదు.

శ్రీ పి. సుందరయ్య నేను చేశాను

శ్రీ పి. తిమ్మారెడ్డి వారి ఉద్దేశము ప్రకారము చేసిఉంటారు వారు చెప్పినదానిప్రకారము రూ. 15 లు అయితే మరొకరు చెప్పే లెక్కలప్రకారము రూ 25 లు అంటారు ఇంకొకరు చెప్పే లెక్కలప్రకారము రూ 35 లు అంటారు. దీనికి ఎలాంటి ఎష్యూరెన్సు ఉందో నాకుచెప్పండి ఈ నాడు భారత దేశమంతా కూడా ఎకరానికి రూ. 100, 200, 300 లు ఖర్చుపెట్టి పంటపండించి తీరా నోటికి వచ్చేసరికి గద్ద తన్నుకుపోయినవిధంగా ఒక్క వర్షము తక్కువయ్యేసరికి పంటంతా నాశనమైపోయింది విత్తనాల ఖర్చు కూడా వచ్చే అవకాశము లేదు పెట్టినకూలంతా దండుగయిపోయింది. భూమి మీద వేసిన ఎరువంతా వృథాఅయిపోయింది. పడినకష్టమంతా వృథాఅయినది. రైతు తానొక్కడేకాకుండా తన భార్యాపిల్లలతో చేసిన కష్టమంతా మట్టి

పాలై పోతున్నది ఆ నష్టాన్ని పూర్తిచేయడానికి ఎవరు ఏమి ఇస్తున్నారు ? ఆ నష్టాన్ని భరించడానికి ఎవరు ఏవిధంగా సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నారు ? ఫలానాధరకు అమ్మాలని ఎవరయితే కోరుతున్నారో వారినే నేను కోరుతున్నాను రైతుకు వచ్చేనష్టాన్ని భరించేందుకు ఏమిచేయాలో చెప్పమని ఏ రైతయినా తరతరాలనుంచి తాతముత్తాతలనుంచి వ్యవసాయము చేస్తూ సంపాదించి మూటకట్టుకున్నాడా ? ఈ కాలంలో రైతుకు నలుగురు పిల్లలు పుడితే ప్రతిపక్షసభ్యులు అనుకునే భూస్వాములు తమ నలుగురుకొడుకులు బి ఏ దాకానో యం ఎ దాకానో చదివించడానికి వీలులేకుండా ఉన్నది ఒకరిద్దరిని చదివించేటప్పటికే చాలా భారమనిపిస్తోంది ఇంతో, అంతో భూమి అమ్మకుండా తాతో, తండ్రో సంపాదించిన బంగారమేదయినా ఉంటే అమ్మకుండా, ఆడవాళ్లు దాచుకున్న బంగారాన్ని తీసుకొని ఏ బ్యాంకులలోనో తాకట్టుపెట్టకుండా వారిపిల్లలను చదివించుకొనే అవకాశము లేకపోతోంది ప్రతిపక్షసభ్యులు అనుకొనేవిధంగా రైతులు సంపాదించినట్లయితే యీ దేశంలో కొంతమందికి తలఎత్తుకొనే అవకాశముండేది కాదు గ్రామాలలోని మనుష్యులమధ్య భేదాలు కల్పించడానికి, అలజడి చేయడానికి వెళ్ళే రాజకీయ పార్టీలవారిని గ్రామాలలో అడుగుపెట్ట కుండా చేసేది రైతులు. ఈనాడు రైతుల దగ్గర అట్టి అవకాశము లేదు ప్రభుత్వంవల్లనో, పరలోకములో పరమేశ్వరునివల్లనో మనకు తెలియదు కాని ఒక సంవత్సరము పంట పండితే ఇంకొక సంవత్సరము పండదు ఒక పంటపండితే ఇంకొక పంటపండదు పంటలు పండితే పశువులకు నష్టము వస్తుంది ఈ రెండూ సవ్యంగా ఉంటే ఇంటిలో ఏ మనిషికో జబ్బుచేయడము తటస్థిస్తుంది ఎన్నాళ్ళుపోయినా జానెడు బెత్తెడుగానే ఉన్నది రైతు పరిస్థితి. ఇలాంటి రైతును పట్టుకొని భూస్వామి అనీ, ఎవరినో దోచుకుంటున్నాడు అని, సంఘ విద్రోహి అని- ఇటువంటి వింతపదాలు వాడుతుంటారు భారతదేశంలో మన పదాలు కొంచెము సుమారుగా ఉన్నాయి ఇతత దేశాలలో ఉండే పదా లనుకూడా కొంతమంది మనపల్లెలకుపోయి ప్రచారము చేస్తూంటారు 'కులక్'లు అంటారు. యీ పదాలన్నీ వింటూంటే చాలా చిత్రంగా ఉంటాయి నాగు పామనో, బెబ్బులి అనో మరొకటనో అనిపిస్తుంది. ఇటువంటి వాటికి అవకాశం ఇవ్వవద్దని సభవారికి మనవి చేస్తున్నాను. ఉరవకొండలోని చేనేత పారిశ్రామి కులు రాత్రి సమయములందు బిచ్చాటనకు పోతున్నారని నాగిరెడ్డిగారు చెప్పారు నిజపరిస్థితులు తెలుసుకోకుండా ఆ విధంగా చెప్పడం భావ్యంకాదని మనవి చేస్తున్నాను. చేనేత పారిశ్రామికులకు రాష్ట్రప్రభుత్వము కేంద్ర ప్రభుత్వం కూడా ఇవ్వవలసిన రక్షణ ఇస్తున్నాయి ఆదుకోవలసినంతవరకూ ఆదుకోడానికి ప్రభుత్వము ప్రయత్నం చేస్తోంది. కాని, చేయవలసినంత చేయలేకపోయి ఉండ

వచ్చు ఆర్థిక పరిస్థితులను బట్టి చేనేత పారిశ్రామికులకు ప్రభుత్వము చేయవలసిన సహాయము చేస్తోంది దేశమంతా యీ విధముగా ఉండగా ఉరవకొండలోని వారు మాత్రము బిచ్చాటనకుపోయే అగత్యము లేదని నేను అనుకొంటున్నాను ఈ నాడు షాహుకారులు బస్తా 15, 16 రూ లకు కొంటున్నారని నాగిరెడ్డి గారు చెప్పారు బస్తా 15, 16 రూ లకు సాహుకారులు కొంటుంటే మామూలు జనానికి 17, 18 రూ లకైనా దొరకాలి కదా ఈనాడు ధరల గురించి మాట్లాడేటప్పుడు ఒక రాగంలో ధరలు పెరిగిపోయాయి, ఆకాశానికి తాకినాయనీ, ఇంకొక రాగంలో పన్నకారు రైతులదగ్గర షాహు కారులు 15, 16 రూ లకే కొంటున్నారనీ అంటారు ఈ మేళవింపులలో చాలా జాగ్రత్తగా ఉండాలని మనవి చేస్తున్నాను ఒకరు చెప్పినమాట ఇంకొకరు చెప్పేటప్పుడు ముందుచెప్పినమాటలు ఏ రకముగా ఉన్నాయని పరిశీలన చేయాలని మనవి చేస్తున్నాను సూర్యనారాయణమూర్తిగారు చక్కనిమాటలు చెప్పారు నాకు చాలా సంతోషము కాని ఇది యీనాటి సంగతి కాదు దేశంలో దారిద్ర్యము తీరాలంటే ప్రతి ఒక్కరికి కడుపునిండా కూడు దొరకాలంటే ప్రజలందరూ సహనముగా బ్రతకాలంటే పంటను అభివృద్ధి చేయడానికి కావలసిన చర్యలన్నీ తీసుకోమన్నారు ఇది చాలా చక్కని సలహా చాలమంది మిత్రులుకూడ యీ సలహాచెప్పారు ప్రభుత్వానికి కూడా ప్రయత్నించాలనే ఉన్నది అక్కడక్కడ చెరువులు, గుంటలున్నాయి ఒకప్రక్కన కాంగ్రెసు ఆధ్వర్యముక్రింద భారతప్రధాని ప్రభుత్వముక్రింద భారతసేవక సమాజాన్ని ఏదోరకంగా వాలంటరీ లేబర్ని తయారుచేస్తున్నారు కల్లూరు సుబ్బారావుగారు రాయలసీమలో, కర్నూలు తాలూకాలో చేయిస్తు న్నారు మూడు, నాలుగు మైళ్ళు కాలువ త్రవ్వించారు మళ్ళీ ముంగారు వర్షాలు వచ్చేలోపల చిన్న చిన్న కుంటలు, చెరువులు అన్నీ మరమ్మతుచేస్తాము. ఎక్కడయినా కట్టుకాలువలు ఉంటే త్రవ్వుతారు. ఎంత డబ్బు ఖర్చుచేసినా మానవుని చేతితోచేసే పనులకే ఖర్చవుతున్నదిగాని మెషీన్‌లకోసం ఖర్చు చేయడంలేదు అందువల్లనే వాలంటరీగా చేయించవలసిన పనులుంటే చేయించు దాము ఏఏ ప్రాంతాలలో కాలువలు కొరతఉన్నాయో అక్కడ కాలువలను జాగ్రత్తగాచేయాలని సి. పి. తిమ్మారెడ్డిగారు అన్నారు ఆ పనితప్పితే ప్రభుత్వానికి ఇంక వేరే ఏమిపనిఉన్నది ? ఏఏ జిల్లాలలో ఏ యే ప్రాంతాలలో పరిస్థితులు ఎట్లాఉన్నాయో తెలుసుకొని ఎక్కడైనా రోగాలువస్తే డాక్టర్లను పంపడము. మందులను పంపడము జరుగుతూంది ఎక్కడైనా నీరుఎక్కువయి గట్లుకొట్టుకు పోతూంటే ఇంజనీర్లను పంపి ఆపుచేయడం జరుగుతున్నది. మామూలుగా, చెరు వులు, కాలువలు, రిపేరుచేయించడానికి ఇంజనీర్లు ఉన్నారు ధాన్యము కొరత వచ్చిందని ఇపుడుమనము అనుకుంటున్నాము. కాబట్టి ఎక్కడెక్కడ ప్రజలకుసౌక

ర్యాలు లేవని ప్రభుత్వ నోటీసుకు వస్తూన్నాయో అక్కడ తగినశ్రద్ధలు తీసుకో డానికి సిద్ధముగా నున్నదని తిమ్మారెడ్డిగారికి మనవిచేస్తున్నాను నేను రైతుల విషయంలో గట్టిగామాట్లాడు తానని రామా రెడ్డిగారన్నారు నేను ప్రత్యేకముగా మాట్లాడినది ఏమిలేదు చేసినది ఏమీలేదు రైతుల పరిస్థితి యీ విధంగా ఉన్నదని పదిమంది ముందర పెట్టడం చేస్తున్నానేగాని అదికూడా ఇక్కడ సభ్యులు చెప్పిన విషయాలనుబట్టి 25 వ వంతుకూడా పెట్టలేదని అనిపిస్తోంది రైతులవిషయము నాకంటే హెచ్చుగా తెలిసినవారున్నారు నేను యీనాడు మంత్రిగా ఉన్నాను కాబట్టి రైతులవిషయము పరిశీలించి చెప్పడానికి ఎక్కువ అవకాశమున్నది రైతులనుగురించి నేనుచెబితే అది గట్టిగా పేపర్లలో వేయడముకాని పదిమంది దానినిగురించి ప్రత్యేకముగా చూడడముగాని జరుగుతున్నది కాబట్టి వారు నాకు కాంప్లిమెంట్సు ఇస్తున్నారుకాని నేను ప్రత్యేకముగా రైతులకు చేస్తున్నది ఏమీలేదు రైతులుకొనే వస్తువులు దరలు పెరిగినప్పుడు రైతులు అమ్మే వస్తువులకు ధరలు ఎందుకు పెరగకూడదు అని రామిరెడ్డిగారన్నారు ఆయన రైతుల స్థితిగతుల విషయమై నాకంటే ఎక్కువగా వాదించే మనిషి ఆ విషయం ఆ ప్రాంతాలలోని ప్రజలకు తెలుసు ఒక్క రైతు మట్టుకు నోరుతెరచి తన సంగతులు చెప్పలేని పరిస్థితిలో ఉన్నాడు మిగతా అందరికి చదువుకున్నవారికి, చదువు రానివారికీ, ఆస్థి ఉన్నవారికీ, లేని వారికీ, ఇళ్ళు ఉన్నవారికీ, లేనివారికీ తమను గురించి చెప్పుకోటానికి అవకాశ మున్నది ఒక్క రైతుకు మాత్రము అట్టి అవకాశములేదు ఈమధ్య నేను కృష్ణాజిల్లా వెళ్లినప్పుడు కొంతమంది రైతుయువకులు కూర్చునియున్నారు ఏమయ్యా మిగిలినవాళ్లెవరో పదిమంది డిప్యుటేషన్ వెడుతున్నారు మన విష యములు వచ్చినప్పుడు వినాలిగదా అంటే మాకు చేతకాదా, మేము పూను కుంటే చేయగలము ఆగష్టు విప్లవాలన్నీ చూస్తిరిగదా, అవన్నీ ఇప్పుడు డెప్యు టేషన్సు వెళ్లినవారే చేశారా ? ఆంధ్రదేశము సంగతి మనకు తెలియనిది ఏమి ఉన్నది ? ఇంట్లో ఉండే ఆఫీసరు బయటికి వచ్చాడా, బయట ఉన్న ఆఫీసరు ఇంట్లోకి వెళ్లకలిగాడా, రైళ్ళు నడచాయా, ఆఫీసులు నడిచాయా ? రైతు కన్ను తెరచినట్లయితే ఎంతపని కాదు అంటారు. అట్టిపనికి పూనుకోమని నేను రైతులకు చెప్పడములేదు. మీరు మీ ధర్మాన్ని నిర్వర్తించండి అని నేను ప్రతి వర్గానికి మనవిచేస్తున్నాను సమర్థతతో సంఘంలో ఉండే ఇతరులను కూడా కాపాడండి అని చెప్పడమే నా వంతు రైతు ప్రతినిధులమంటూ రాజకీయాలు గురించి మాట్లాడటానికి యీనాడు చాలా మంది తయారవుతున్నారు. కాని రైతులే తమ విషయాలు చెప్పుకోడానికి తయారు ఆవవలసిన అవసరమున్నది కూలీలకు సంఘాలు ఉన్నాయి, యన్ జి ఓ. లకు సంఘములున్నాయి. రైతు లకు సంఘాలు ఏర్పాటుచేయవలసిన అగత్యమున్నది. కొన్ని రాజకీయ పార్టీల

వారు ఇదివరకే కొన్ని రైతుసంఘాలు పెట్టారు మొన్నమొన్ననే కాంగ్రెసు పార్టీలో కూడా రైతుల ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితుల గురించి ప్రభుత్వముతో చెప్పడానికి అవకాశము కల్పించాలని చెప్పారు ఇకముందు రైతులు తమ విషయాలు చెప్పుకోడానికి అవకాశము దొరుకుతుందని రామిరెడ్డిగారికి మనవిచేసుకున్నాను ఇంక, రంగారెడ్డిగారు ఖచ్చితమైన రైతువాది రైతుల విషయము గురించి మాట్లాడేవారుంటే వారు ఇతరులకు ప్రాతినిధ్యము వహించరనికాదు రైతులగురించి ఇదివరకు ఎవరూ మాట్లాడేవారుకాదు ఈ నాడు కొంతమంది మాట్లాడుతున్నారు కాబట్టి వారిని ప్రత్యేకించి నీవు మమ్ములను గురించి మాట్లాడుతున్నావు స్వామీ నీకు మా ధన్యవాదం అంటున్నారు నరసయ్యగారు పేపర్లలోపడే ప్రకటనను చూచికూడా మంత్రిగారు ఏదో మూసి పెడతారని అంటున్నారు పత్రికలలో పడతాయి ఒక గ్రామానికి పోయి 5,000 రూపాయలు ఖర్చుచేసి, 20 వేలమంది సమావేశము అయినాకూడా అది పేపర్లలో పడదు పడినా కూడా ఒకటిన్నర లైను పడుతుంది హైదరాబాదు, మద్రాస్ సిటీలలో ఎక్కడనో మారుమూల చింతచెట్టు క్రింద పదిమంది చేరినా సరే ఇంకేమీ న్యూసు లేకపోతే అది రెండు కాలాలు పడుతుంది బ్రహ్మాండంగా పడుతుంది అందువల్ల పత్రికలలో ప్రకటనలు పడినంత మాత్రాన ఏ ప్రభుత్వమూ బెదరదు. ఈ ప్రభుత్వము అసలు బెదరదని మనవిచేస్తున్నాను

ఎన్ని ప్రకటనలు పడినా, ఎన్ని డిమాన్‌స్ట్రేషన్సు వచ్చినా, నిజ పరిస్థితులు గమనించి నడుచుకొనవలసిన విధంగా ప్రభుత్వం నడుస్తుంది ఈ బెదరింపులకు బెదరదు ప్రజాశ్రేయస్సును దృష్టిలో పెట్టుకు నడుస్తుంది. ఎక్కడో ప్రకటనలు పడినంత మాత్రాన, నరసయ్యగారు చెప్పినట్టు, బెదిరేదానికే అవకాశం లేదు ఏదో కాలము తోసివేయుటకు మంత్రి చెపుతున్నాడని, శ్రద్ధ తీసుకొనుట లేదని అన్నారు దానినిగురించి ఏమి ఉన్నదో మేము పరిశీలనచేస్తూనే ఉన్నాము ఏమి ప్రమాదములు జరిగినవి ? ఈ డెప్యుటేషన్సు వచ్చే దినానికి, పత్రికలలో ప్రకటనలు పడే దినానికి, ఆ తరువాత ధరలు తగ్గుతూనే వస్తున్నాయి సభ్యులు అనుకొన్నట్లు ప్రభుత్వం బెదరేటట్లుగా వుంటే పని చేయుట కష్టము. ప్రభుత్వం అంటే ఒక్క తిమ్మారెడ్డే కాదు, ఒక్క మంత్రే కాదు, ఒక్క మంత్రివర్గమే కాదు, ఇది ఒక పెద్ద మిషనరీ, ఒకపెద్ద ఇన్‌స్టిట్యూషను గ్రామం నుంచి, రాష్ట్రంనుంచి కేంద్రం వరకు సంబంధాలు పెట్టుకొని. ఎన్నో ఏండ్లనుంచి ఉన్న అనుభవాలతో కూడిన మెషినరీ యిది. ప్రతి నిమిషానికి కావలసిన సమాచారాన్ని రాబట్టి ప్రభుత్వం శ్రద్ధతీసుకుంటూనే ఉన్నది. కృష్ణమాచారిగారు చాలా చక్కటి సలహాలు యిచ్చారు. షావుకార్ల

భూస్వాములు అయిన రైతులు యీ అప్పులు తీసుకుంటున్నారు ఆయిల్ ఇంజనులు కావచ్చును, ఎలక్ట్రిక్ మోటార్లు కావచ్చును వెంకటరావుగారు చెప్పినారు, రిజర్వుబ్యాంకులో అప్పుదొరుకుట కష్టముగా ఉన్నదని ఈ అప్పులు వసూలుచేస్తే ప్రభుత్వంలో జీతాలు యివ్వటానికి కావలసి వస్తుందని చెప్పారు అప్పులు తీర్చుటకు ఎంతమంది రైతులు అవమానానికి లోబడి తమ ఆస్థులను వేలానికి పెట్టవలసిన పరిస్థితులు వస్తున్నాయో నాకు తెలుసు అందు వల్ల కృష్ణమాచారిగారు చెప్పినట్లు రైతులసంగతి ప్రభుత్వానికి తెలుసు

ఎరువులు సమయానికి దొరకడంలేదని అంటున్నారు. ఒప్పుకుంటాను. రైతులకు, సమయానికి, అవసరమయిన ఎరువులు యివ్వలేకపోయాము. సూయజ్ కాలువ యుద్ధంవలన ఈ దేశానికి రావలసిన ఎరువులు రాలేదు వచ్చినాకూడ, అక్కడ హార్బరునుంచి రైలులో పంపుటకు సౌకర్యం లేక పోయింది. కొన్నిచోట్ల ఎరువులు కొంతమంది దుర్మార్గులు తీసుకొని mischief చేసినమాట వాస్తవమే కాని ఉద్యోగస్థులను నిందించి లాభం లేదని మనవి చేస్తున్నాను కర్ణం వద్దనుంచి సర్టిఫికేట్ తెచ్చిన మనిషికి, యివ్వనని చెప్పు టకు ఏ ఉద్యోగస్థునికి అవకాశం లేదు అప్పుగా తీసుకొన్న ఎరువును యింకొక రికి లాభానికి అమ్ముకున్నాడంటే, దానికి C I. D ని పెట్టాలంటే వీలుపడదు కాని ఎవరయినా, ఫలానివారు యీ రకంగా చేశారని కంప్లెయింట్ చేస్తే నేను చర్యతీసుకొనుటకు సిద్ధంగా ఉన్నాను

అప్పారావుగారు తమ జిల్లాలోని పరిస్థితిని గురించి గట్టిగా వాదించారు వైజాగ్ జిల్లాసంగతి నాకు తెలుసు ఇతర జిల్లాలలో నూరు ఖర్చుపెట్టేదానికి అక్కడ 50 రూపాయలతో నీటి వసరులు కలిగించే అవకాశం ఉంటుంది దగ్గర కొండలలో కావలసినంత నీరు, బంగారు భూములు, నీరుకు ఏమి ఖర్చు పెట్టినా నాలుగయిదేండ్లలో పెట్టుబడి వాపసు వచ్చుటకు అవకాశం ఉన్నది ఆంధ్రదేశం మొత్తంమీద చూస్తే—గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, యీ కోస్తాప్రాంతాలలో 20, 30 తాలూకాలతో తప్పితే, మిగతా రాష్ట్రం అతివృష్టి అనావృష్టికి పాలవుతున్నది. చెరువుల విషయం శ్రీ జె వి నరసింగ రావుగారు కేంద్ర ప్రభుత్వానికి చెప్పారు దాదాపు 32 వేల చెరువులు మరమ్మతులు కావలసి యున్నవని, డబ్బు యిస్తే మరమ్మతులు చేయించి సం వత్సరం ఆఖరుకు కావలసినంత ధాన్యం పండిస్తామని కేంద్ర ప్రభుత్వానికి చెప్పు తూనే ఉన్నారు. కాని వాళ్ళ పరిస్థితులు వాళ్లకు ఉన్నాయి ఇంతో అంతో యివ్వ గలుగుతున్నారు. యిచ్చిన డబ్బుతో ఎంతచేస్తామో, చెప్పలేకుండా ఉన్నాము. విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలో చేయవలసిన పని చాలా ఉన్నదని మనవిచేస్తున్నాను.

ఉన్నట్లుండి అఖాండాలు వేస్తారని సీతయ్యగుప్తగారు అన్నారు మమూలుగా, రాజకీయాలలో, యిలాంటి సందర్భాలలో విమర్శిస్తూనే ఉంటారు వ్యాపారస్తులనేమిటి, రైతులను, చదువుకొన్నవారిని, రాజకీయాలు పెట్టుకొని సందర్భానుసారంగా ఎవరినో ఒకరిని పట్టుకు విమర్శిస్తూనేఉంటారు ఏదో ఒకవృత్తి చేసుకొనేవారిని గురించి చేస్తున్నారంటే అది అంత సందర్భం కాదేమో ఇతరదేశాలలో కూడా వ్యాపారస్తులు ఉన్నారు అక్కడ కోఆపరేటివ్ సంస్థలలో పెరిగివచ్చిన వ్యాపారస్థులు కనబడకుండాపోయినారే! ఈ దేశంలో కోఆపరేటివ్సు పెట్టుటకు అభ్యంతరం ఏమిటి? M L As. కావచ్చు, ప్రజాప్రతినిధులు కావచ్చు, గ్రామాలలో ఉండేవారు కావచ్చు, కోఆపరేటివ్స్ పెట్టేదానికి ఎందుకు ప్రయత్నం చేయరు? ఈ నగరంలో నావద్దకు డెప్యుటేషన్ వచ్చిన లేబరును, వారికి కోఆపరేటివ్ సొసైటీ ఉన్నదా అని అడిగాను సంఘం ఉన్నదని, కోఆపరేటివ్ సొసైటీ లేదని అంటారు కోఆపరేటివ్స్ పెట్టితే యింతో అంతో యివ్వగలిగిన సహాయం వాటిద్వారా లేబరుకు అందించటానికి అవకాశం ఉంటుంది, రాజకీయంగా పెద్దపెద్ద సంఘాలు ఉన్నవి Strikes చేస్తారు ఏకీభవించకపోతే తలకాయలు బ్రద్దలుకొట్టగలరు కాని కోఆపరేటివ్స్ పెట్టుటకు తాహతులేకుండా ఉన్నది. రాజకీయాల పేరుతో లేబరును నడిపేవారికందరికీ కూడా చెపుతున్నాను ఎన్ని కోఆపరేటివ్స్ పెట్టితే అంత సంతోషం

సీతయ్యగుప్తగారు మాట్లాడుతూ, జోన్సు పెట్టినారని చెప్పినారు, ఆంధ్రదేశంలో దీనికి ఎంతో బాధపడుతున్నారు బెంగాలులో బియ్యంధర చూస్తే నల్లార్లు—యిక్కడ మనకు కడపటిరకం బియ్యం రు 16, 17 అమ్మేదానికికూడ అవకాశంలేనివి అక్కడ రు 23 లకు అమ్ముతున్నారు కలకత్తా జోనులో కొంతవరకు సరఫరా చేయుటకు వీలున్నది నన్ను బొంబాయి చీఫ్ మినిస్టరు బొంబాయిని మన జోనులో ఎందుకు పెట్టుకోలేదని అడిగినారు ఆంధ్రదేశానికి ప్రధానమైన కష్టమరు బొంబాయి వారు 60 వేల టన్నులు ఆంధ్రదేశంనుంచి తీసుకుంటారు. కాని కేంద్రప్రభుత్వంవారి, ఆలోచన ప్రకారం బొంబాయి ఈ జోనులో లేదు ధరలు జాస్తీగా ఉన్నా, బొంబాయివారే కొనగలమని అన్నారు. కాని ఈ జోను వేరుచేశారు ఆంధ్రదేశంలో కొన్ని ప్రాంతాలలోని కొన్ని వర్గాలవారికి ఏధరఉన్నాసరే కొనుటకు యిబ్బందిగా ఉంటున్నది. సుందరయ్యగారు ఒప్పు కొంటున్నారు. కొంతమంది కూలిలేకుండా కూడ బ్రతకవలసిన అగత్యం ఉంటోంది. వాళ్లకు గంజో, ఏదో ఉచితంగా పోయవలసిన ఏర్పాటు చేయాలని అంటున్నారు. కొన్ని వర్గాలవారికి మణుగు రు. 23, 24 ఉన్నా,

కొనుక్కొనుటకు వీలుంటుంది ఈ మధ్యన ఒక జిల్లాలో, ఒక పత్రిక కరస్పాండెంట్ నా వద్దకువచ్చి వారి ఊరిలో బియ్యంధర చాలా పెరిగిందన్నారు ఎంత పెరిగిందని అడిగితే మణుగు రు 24 లు అన్నారు రెండవరకం బియ్యం రు 15, 17½ ఉన్నదన్నారు ప్రభుత్వ మనిషిగా నేను ఏ ధరచూడాలని అడిగాను ఆయన పేదవాళ్ళు కూడ ఈమధ్యకాలములో రు 24 ల రకం బియ్యానికి అలవాటు పడినారన్నారు వాళ్ళ అలవాటుపడిన బియ్యానికి, వాళ్ళకు తగినట్లు ధరలు నిర్ణయించాలంటే రైతులను నాశనం చేస్తేగాని సాధ్యంకాదు ఏ వృత్తోచేసి సాయంకాలానికి యింత మాంసమో, చేపో, కమ్మగాతిని, దినం మార్చి దినం అయినాసరే, యిష్టంఉన్నా లేకపోయినా, భార్య ప్రోత్సాహం తోనో, తన ప్రోత్సాహంతోనో సినిమాకు వెళ్ళటం - యిటువంటి అవకాశాలు ఉండేవాళ్ళకు, రుచిగా యింపుగా ఉండేటట్లు వాళ్ళ నోట్లోనుంచి కోపం రాకుండా, వాళ్ళ కండలలోనుంచి ఎరుపు కనబడకుండా ఉండాలంటే రైతులను పూర్తిగా సున్నంచేయాలి. గ్రామాలను సర్వనాశనం చేయాలి గ్రామాలలో ఉండే జనాన్ని, అక్కడఉండే నాలుగుకాళ్ళ పశువులతోబాటు రెండుకాళ్ళ పశువులుగా మార్చి, వాళ్ళచేత చెమట ఓడ్చిస్తే, దానిద్వారా వీరు సుఖంగా ఉండటానికి అవకాశం ఉంటుంది. దీనికి ప్రభుత్వం పూనుకొనలేదని మనవి చేస్తున్నాను

సుందరయ్యగారు చెబుతూ ఇక్కడకూడ చైనాపరిస్థితి పర్పడుతుందన్నారు ఆ కాలం వచ్చినపుడు జరుగుతుంది అనేకం జరుగుతున్నాయి. వెన్నెల, చీకటి ఒకదానివెంట ఒకటి వస్తూనే ఉంటాయి. ఏ పార్టీ పరిస్థితి, ఏదేశ పరిస్థితి ఎట్లా ఉంటుందో తెలియదు. ఈ దేశంలోనే రెండువేల సంవత్సరాల క్రితం లిచ్ఛవీస్ అనేవారు పాటలీపుత్ర ఇలాకాలో ఉన్నారు లిచ్ఛవీస్ అనే తెగ యీదేశంలో రెండువేల సంవత్సరాల క్రితం పుట్టింది. పోయింది. లిచ్ఛవీస్‌వారికి దేవుళ్లలో నమ్మకంలేదు. ఆయి వరసల మీద నమ్మకంలేదు ఆస్తిలో నమ్మకంలేదు. మానవత్వంలో నమ్మకంలేదు వారు అప్పుడు రాజ్యం నడిపినారు వారుకూడా పోయినారు. ఇప్పుడుకూడ రాజ్యాలు వస్తూంటాయి, పోతూంటాయి పార్టీలు వస్తూంటాయి; పోతూంటాయి సిద్ధాంతాలు ఉంటాయి, ఊడతాయి కాబట్టి సుందరయ్యగారు అనుకొన్నప్రకారం ప్రభుత్వం మారితే, అప్పుడు ఆయన సిద్ధాంతాలు, ఆలోచనలు అమలులోపెట్టేదానికి ఎవరికీ అభ్యంతరం ఉండదు. ఆ దినం ఆయన ప్రభుత్వం నడిపినపుడు అందరు వారిరొుక్క అజ్ఞానుసారం నడుచుకోవలసిన ఆగత్యం ఉంటుంది అందుకు ఎవరికి అభ్యంతరం ఉండదు.

కొండయ్యగారు కొంచెం చురుకుగా మాట్లాడతారు. మామూలుగా ఆయన స్వభావమది. ఆయనకు చాలా విద్యలు వచ్చు ఆయన రైతు, వకీలు,

పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు. ఈరోజున యం ఎల్ ఏ అందులో ప్రత్యేకంగా రైతుతత్వం ఉండే మనిషి రాజకీయ సిద్ధాంతాలు పరిశీలనచేసిన మనిషి. పైగా నెల్లూరు జిల్లానుంచి వచ్చిన మనిషి ఆయన కొంచెం యోచనగా, బాగా లోతుగా స్టడీచేసి మాట్లాడుతూ ఉంటారు ఎవరైనా కొంచెం ఖచ్చితంగా మాట్లాడితే కొంతమందికి పుల్లవిరుపుగా కనిపిస్తుంది కాని ఆయన మాట్లాడిన దాంట్లో ప్రత్యేకంగా ఏమీలేదు ఆయన కోరింది ఒకటే చేనేత పారిశ్రామికులకు అన్ని రక్షణలు కావాలనేటట్టుగా ఉంటే. ఫ్యాక్టరీలలో ఉండే కూలీలకు అన్ని రక్షణలు కావాలనే టట్టుగా ఉంటే రైతులకు కూడా రక్షణలు కలుగజేయవలసిన న్యాయం ఉన్నదికదా అన్నారు రైతు కొనే వస్తువుల ధరలు పెరిగినపుడు. రైతు అమ్మే వస్తువులు కూడ పెరగవలసిఉండటం న్యాయమే కదా అని వకీలుమాదిరి అన్నారు ఆవిధంగా ఆయన వాదించినాడు అంతేగాని ఎవరిని తూష్ణీంభావంతో చూడవలెనని గాని. అగౌరవపర్చవలెనని గాని కొండయ్యగారు మాట్లాడలేదు రైతులయొక్క పంట. కష్టం. చెమటయొక్క విలువ ఏ స్థాయిలో ఉండాలనే విషయం కొండయ్యగారు చెప్పినారు గానీ. ఇతరులను నిందించలేదు. ఇతరులను విమర్శించలేదు

సుందరయ్యగారు చాలా మంచి విషయాలు చెప్పినారు వారు లెక్కాచారం కూడ చెప్పినారు ఫుడ్ రీసర్చి వారో. న్యూట్రిషన్ కమిటీవారో. 14 ఔ ఉండాలని చెప్పినారన్నారు ఆ న్యూట్రిషన్ కమిటీవారు చెప్పినట్లు మనలో ఎంతమంది తింటున్నారో నాకు తెలియదు

శ్రీ పి. సుందరయ్య రష్యాలో ఉన్న న్యూట్రిషన్ కమిటీ కాదుచెప్పింది మన దేశంలో ఉన్న న్యూట్రిషన్ కమిటీ చెప్పింది

శ్రీ పి. తిమ్మారెడ్డి : రష్యాలో ఉండేది. అమెరికాలో ఉండేదానికంటె కొంచెం తక్కువ ఉండవచ్చు మనది ఇంకా తక్కువగా ఉన్నా. నేనుమట్టుకు తగ్గించుకోవటంలేదు నేను ఏ తిండి తింటున్నానో కాని, నా రక్తపుష్టి. నా మేధావితనం. నా నరాల పుష్టి ఆ రష్యాలవారి కంటె. అమెరికాలవారి కంటె కూడ గట్టిగానే ఉన్నదని చెబుతున్నాను. మనకు ఎక్కువ ఆస్థి లేకపోయినా, యీదేశం అవినీతిలోకి పోలేదు తింటిమో. తినకపోతిమో కాని. మానవత్వం అన్నది భాగతీయులలో ఉన్నదనిమాత్రం సుందరయ్యగారికి మనవి చేస్తూ. ఆహార పరిస్థితి గురించి ఆందోళనపడవలసిన అవసరం అంతగా లేదని తెలియజేస్తూ. సెలవుతీసుకొంటున్నాను

***The House then adjourned till Half Past Eight of the Clock on Thursday, the 7th November 57.***